# నీతినిధి

ఆంగ్లమూలమున కింపైన తెనిగింపు

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి



శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళి

సంపాదకులు

డా॥ వేటూరి ఆనందమూర్తి



గ్రంథసంపాదకులు

డా॥ వేటూరి చంద్రశేఖర శాస్త్రి



ప్రచురణ

వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు

హైదరాబాదు

# నీతినిధి

ఆంగ్లమూలమున కింపైన తెనిగింపు

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి



శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళి

సంపాదకులు

డా॥ వేటూరి ఆనందమూర్తి



గ్రంథసంపాదకులు

డా॥ వేటూరి చంద్రశేఖర శాస్త్రి



ప్రచురణ

వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు

హైదరాబాదు

శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళి—౧

# నీతినిధి



అనువాదకులు

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి



ప్రస్తావన

డా॥ వేటూరి చంద్రశేఖరశాస్త్రి

గ్రంథ ప్రశంస

శ్రీ వేటూరి ఆంజనేయులు



ప్రచురణ

వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు

హైదరాబాదు

శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళి—౧

# నీతినిధి



అనువాదకులు

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి



ప్రస్తావన

డా॥ వేటూరి చంద్రశేఖరశాస్త్రి

గ్రంథ ప్రశంస

శ్రీ వేటూరి ఆంజనేయులు



ప్రచురణ

వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు

హైదరాబాదు

Sri Prabhakara Sampurna Granthavali - 1

**NEETI NIDHI**

By Late Sri Veturi Prabhakara Sastri

First Edition : 1926
Second Edition : 1982
Copies : 1000

Title Design : Seela Veerraju



**Price Rs. 18-00**

Published by :
**Veturi Prabhakara Sastri Memorial Trust**
6/2 RT, (New) Vijayanagar Colony,
HYDERABAD-500 457.

*Printed at* :
MASTER Art Printers
1-1-694/2/A, Gandhi Nagar,
HYDERABAD-500 380.

# విషయసూచిక


మనవి ౭ ప్రకాశకులు
ఉపోద్ఘాతకీయము* ౯ [కా. నాగేశ్వరరావు]
అంకితము* ౧౩ [వేటూరి ప్రభాకరశాస్త్రి]
తొలిపలుకు* ౧౭ [వేటూరి ప్రభాకరశాస్త్రి]
ఉత్తరము* ౨౦ [ఆంగ్లానువాదకారుడు]
ప్రజాసామాన్యమునకై
ప్రకటన* ౨౬ [ఆంగ్లముద్రణ]

[*'నీతి నిధి' (1926) తొలిముద్రణమునందున్న
ఈఅంశములు యథాతథముగ నిందు గ్రహింపబడినవి.]

ప్రస్తావన ౨౭ డా॥ వేటూరి చంద్రశేఖరశాస్త్రి
గ్రంథప్రశంస
Neeti Nidhi -
A Unique Exercise
in Translation ౩౩ Sri Veturi Anjaneyulu


# ప్రథమ భాగము


అవతరణిక .... 1

ప్రథమాధ్యాయము
మానవుని ధర్మములు

పర్యాలోచనము (౧) .... 4
అణకువ (౨) .... 5
పూనిక (౩) .... 7
సద్గుణలిప్స (౪) .... 9
దూరాలోచన (౫) .... 11
స్థైర్యము (౬) .... 14
సంతుష్టి (౭) .... 15
మితభోగము (౮) .... 17

## ద్వితీయాధ్యాయము
### మనోవికారములు


ప్రత్యాశ—నిరాశ (౧) .... 22
సంతోషము, దుఃఖము (౨) .... 23
కోపము (౩) .... 26
కనికరము (౪) .... 28
కోరిక, ప్రేమ (౫) .... 29


## తృతీయాధ్యాయము


ఓపిక .... 31


## చతుర్థాధ్యాయము
### రక్తసంబంధము


పెనిమిటి (౧) .... 35
తండ్రి (౨) .... 37
పుత్త్రిఁడు (౩) .... 39
అన్నదమ్ములు (౪) .... 40


## పంచమాధ్యాయము
### మనుష్యులలో దైవికములయిన తారతమ్యములు


జ్ఞానవంతులు, జ్ఞానహీనులు (౧) .... 41
భాగ్యవంతులు, దరిద్రులు (౨) .... 43
యజమానులు, సేవకులు (౩) .... 46
రాజు, ప్రజలు (౪) .... 47

ష ష్ఠా ధ్యా య ము

సాంఘిక ధర్మములు


| | | |
|---|---|---|
| ఉపకారబుద్ధి (౧) | .... | 51 |
| న్యాయము (౨) | .... | 52 |
| త్యాగము (౩) | .... | 53 |
| కృతజ్ఞత (౪) | .... | 54 |
| నిష్కాపట్యము (౫) | .... | 55 |


స ప్త మా ధ్యా య ము


| | | |
|---|---|---|
| మతము | .... | 58 |


# ద్వి తీ య భా గ ము

ప్ర థ మా ధ్యా య ము

మానవసామాన్య విషయములు — పుట


| | | |
|---|---|---|
| మానవదేహము, దాని నిర్మాణమును (౧) | .... | 65 |
| ఇంద్రియముల యుపయోగములు (౨) | .... | 67 |
| మనుజుని యాత్మ, దాని యారంభము, చేష్టితములు (౩) | .... | 70 |
| మానవుని జీవితకాలము, దాని ప్రయోజనములు (౪) | .... | 75 |


ద్వి తీ యా ధ్యా య ము

మనుష్యుని మనోవికారములు, వాని దోషములు


| | | |
|---|---|---|
| గర్వము (౧) | .... | 83 |
| చాంచల్యము (౨) | .... | 86 |
| దౌర్బల్యము (౩) | .... | 92 |
| జ్ఞానముచాలమి (౪) | .... | 96 |
| దౌర్భాగ్యము (౫) | .... | 101 |
| వివేకము (౬) | .... | 105 |
| అహంకారము (౭) | .... | 110 |

## తృ తీ యా ధ్యా య ము

### స్వపరానర్థకములగు వ్యామోహములు


| | | |
|---|---|---|
| దురాశ (౧) | .... | 116 |
| మితిమీఱుట (౨) | .... | 119 |
| ప్రత్యపకారచింత (౩) | .... | 121 |
| క్రూరత్వము, ఏవగింపు, అసూయ (౪) | .... | 126 |
| హృదయోద్వేగము (౫) | .... | 130 |


## చ తు ర్థా ధ్యా య ము

### మనుజుఁడు తోడివారిమీఁటి పొందఁదగిన దొడ్డగుణములు


| | | |
|---|---|---|
| ఘనత, గౌరవము (౧) | .... | 137 |
| శాస్త్రములు, పాండిత్యము (౨) | .... | 142 |


## ప ం చ మా ధ్యా య ము

### తప్పించుకోరాని దైవికములు


| | | |
|---|---|---|
| లాభనష్టములు (౧) | .... | 147 |
| వ్యాధి, బాధ (౨) | .... | 151 |
| మరణము (౩) | .... | 152 |




# మనవి

ఇంకొక ఆరేండ్లలో, అనగా 1988 ఫిబ్రవరి 7వ తేదీ నాటికి స్వర్గీయ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శతజయంతి రానున్నది. అప్పటిలోగా శ్రీ ప్రభాకర గ్రంథావళిని సంపూర్ణముగా వెలువరచే ప్రయత్నము సాగింపవలెనని సంకల్పించితిమి. ఆ పనికి పూనుకొని శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళిలో తొలి సంపుటముగా ఇప్పుడీ నీతినిధిని ప్రకటించుచున్నాము. క్రమమున ఇట్లే తక్కిన సంపుటములును వెలువడగలవు.

ఈ ప్రయత్నమున ఆర్థిక వ్యవస్థాపరములైన ఇబ్బందులను అధిగమించుటకై "వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు" స్థాపన కుద్యమించితిమి. ఈ ట్రస్టు త్వరలోనే వ్యవస్థితము కానున్నది. ఇకపై మా ప్రచురణములన్నియు ఈ ట్రస్టుపేరనే వెలువడగలవు.

వీటిమూలమున వాఙ్మయ—యోగ—పరిశోధన రంగముల కంకితమైన శ్రీ ప్రభాకరుల కీర్తిద్యుతు లిక నిరాటంకముగా నాంధ్రావని నలరింపజేయుచుండగలవని మా విశ్వాసము. ఇంతకు పూర్వము శ్రీ ప్రభాకర పరిశోధక మండలి పక్షమున జరుగుచుండిన కృషియొక్క ఫలరూపమైన వికాసమే ఇప్పుడేర్పడిన ట్రస్టు. గత రెండేళ్లుగా వెలువడుచున్న మా "మణిమంజరి" షాణ్మాసిక పత్రికయు ఈ కృషికి తగిన ప్రాతిపదిక నేర్పరచినది. అదియు కొనసాగగలదు.

శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళి ప్రణాళికను గూర్చియు, ట్రస్టు ఆదర్శములను గూర్చియు మున్ముందు విన్నవించుకోగలము.

శ్రీ ప్రభాకరుల నీతినిధి (1926); తెలుగు మెఱుగులు (1948) వంటి గ్రంథము లొకటిరెండు ఆంధ్రగ్రంథమాల పక్షమున పూర్వము ప్రచురింపబడి యుండినవి. శ్రీ ప్రభాకర పరిశోధకమండలి పక్షమున "తెలుగుమెఱుగు"

లిదివరకే పునర్ముద్రణ భాగ్యమందినవి. అట్టివ్యాస సంకలనముల ప్రతు లన్నియు నేడు చెల్లిపోయినవి. వానినన్నిటిని కలిపి శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళిలో తిరిగి ఒక సంపుటముగా మున్ముందు వెలువరచగలము.

తొలి ముద్రణము వెలువడిన ఏభైయారేండ్ల తర్వాత నీతినిధి రెండవ ముద్రణమిది మీముందున్నది. గ్రంథ పునర్ముద్రణావశ్యకతను గూర్చి మేమిందు వేరుగా వ్రాయనవసరములేదు. తొలికూర్పునందున్న విషయము లన్నింటిని మేమిందు యథాతథముగా స్వీకరించితిమి. తొమ్మిదేండ్ల వయసున ఆనాడీగ్రంథము నంకితముగొన్న వాసిరెడ్డి రామగోపాలకృష్ణ మహేశ్వర ప్రసాదుగారు నేడు మనమధ్యనలేరు. వారినీ సందర్భమున స్మరించుచున్నాము.

నీతినిధి తొలికూర్పును తమ గ్రంథమాలలో ఒక కుసుమముగా స్వీక రించి ప్రకటించిన ఆంధ్రగ్రంథమాలవారి సౌజన్యము నీపట్టున కీర్తించు చున్నాము. ఈ ముద్రణమున కడిగిన తోడనే అప్పుగా కొంత ద్రవ్యసహాయ మందించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారిని కృతజ్ఞతతో స్మరించు చున్నాము. శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళి ప్రణాళిక ననుసరించి ఈ గ్రంథ సంపాదకులుగా నుండ నంగీకరించి ప్రస్తావన విషయమును వ్రాసి పంపిన పూజ్యులు డా॥ వేటూరి చంద్రశేఖరశాస్త్రిగారికిని, ఆంగ్లమున గ్రంథ ప్రశంసనందించి తోడుపడిన శ్రీ వేటూరి ఆంజనేయులుగారికిని నమోవాకము లర్పించుచున్నాము.

ముఖపత్రము నందముగా తీర్చియిచ్చిన కళాకారులు శ్రీ శీలా వీర్రాజు గారికిని, ముఖపత్రమును ముద్రించిన నందినీ ఆర్ట్ ప్రింటర్స్‌వారికిని, గ్రంథ ముద్రణమును అచిరకాలములోనే ముచ్చటగా ముగించి యిచ్చిన మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్ వారికిని హార్దాభినందన లందించుచున్నాము.

విద్యాధికు లీ నీతినిధి నాదరింపగలరని విశ్వసించుచున్నాము.

—ప్రకాశకులు

# సంపాదకీయము

శ్రీ సీతినిధి ఆంధ్ర గ్రంథమాలయం దాఱవ కుసుమము. గ్రంథ మాంగ్లగ్రంథమున కనువాదము. సుప్రసిద్ధ గ్రంథకర్తలు బ్రహ్మజ్ఞాన సంపన్నులు శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిలుగా రనువాదకులు. గ్రంథో దంతము మూలగ్రంథమునందున్న విధమున నిందుఁ బొందుపఱుపఁ బడినది. నీతినిధికిఁ బీఠికను వ్రాయఁబూనుట భాస్కరునిఁ గరదీపికలతోఁ జూపఁబూను నటులుండును. అయినను నియతమైన బాధ్యతయే యీ ప్రయత్నమునకుఁ గారణము. అంతయును బంగారమైయున్నపు డేరి కోరి మెఱుఁగులను నియా పించు టసాధ్యముగదా!

పూర్వకాలమునుండియును భరతఖండము బ్రహ్మ జిజ్ఞాసువులకు నిలయము. బ్రాహ్మణ క్షత్రియాదులు తపోనిష్ఠాగరిష్ఠులై బ్రహ్మజ్ఞానమే జీవ యాత్రకు ఫలమని గ్రహించుచుండిరి. ఆ బ్రహ్మజ్ఞులందొక రీ గ్రంథమును సంస్కృతభాషయందు రచించిరి. "సంస్కృతగ్రంథము త్రివిష్టపమును జేరి త్రివిష్టపభాషారూపమును దాల్చినది. త్రివిష్టపభాషనుండి చీనాభాషానువాదమును బడసినది. చీనాభాషనుండి యాంగ్లభాషాంతరీకరణమును బొందినది." ఇయ్యది చస్టరుఫీల్డు ప్రభువునకు చీనానుండి గ్రంథకర్త వ్రాసిన యుదంతము. ఇందుఁ గొంత సత్యమున్నను, గ్రంథరచనయందు గ్రంథకర్త భావములు విశేషముగఁ జేరియున్న విధమును గ్రంథపరిశీలనము విశదము చేయుచున్నది. క్రైస్తవమత సంప్రదాయములు, పలస్తీను ఈజిపు అరాబియాభివర్ణనములు, సముద్రోపమానములు భారతీయ బ్రహ్మజ్ఞాన సంప్రదాయములకుఁ బ్రతికూలముగను, క్రైస్తవమతసంప్రదాయముల కనుకూలముగను నున్నవి. క్రైస్తవ మతాభినివేశము, పాశ్చాత్యసంస్కారము గ్రంథమునందలి భావసాంకర్యము నకుఁ గారణమై యుండనోపును. గ్రంథము ప్రాచ్యవిజ్ఞానసంజాతమైనను, పాశ్చాత్యవిజ్ఞానసంజాతమైనను లేక యుభయ విజ్ఞానముల ఫలమైనను గ్రంథ రాజమై యాంధ్రభాషాయోష కొక యలంకారముగ నుండఁగలదు.

లిదివరకే పునర్ముద్రణ భాగ్యమందినవి. అట్టివ్యాస సంకలనముల ప్రతు లన్నియు నేడు చెల్లిపోయినవి. వానినన్నిటిని కలిపి శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళిలో తిరిగి ఒక సంపుటముగా మున్ముందు వెలువరచగలము.

తొలి ముద్రణము వెలువడిన ఏభైయారేండ్ల తర్వాత నీతినిధి రెండవ ముద్రణమిది మీముం దున్నది. గ్రంథ పునర్ముద్రణావశ్యకతను గూర్చి మేమిందు వేరుగా వ్రాయనవసరములేదు. తొలికూర్పునందున్న విషయము లన్నింటిని మేమిందు యథాతథముగా స్వీకరించితిమి. తొమ్మిదేండ్ల వయసున ఆనాడీ గ్రంథము నంకితముగొన్న వాసిరెడ్డి రామగోపాలకృష్ణ మహేశ్వర ప్రసాదుగారు నేడు మనమధ్యనలేరు. వారినీ సందర్భమున స్మరించుచున్నాము.

నీతినిధి తొలికూర్పును తమ గ్రంథమాలలో ఒక కుసుమముగా స్వీక రించి ప్రకటించిన ఆంధ్రగ్రంథమాలవారి సౌజన్యము నీపట్టున కీర్తించు చున్నాము. ఈ ముద్రణమున కడిగిన తోడనే అప్పుగా కొంత ద్రవ్యసహాయ మందించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారిని కృతజ్ఞతతో స్మరించు చున్నాము. శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళి ప్రణాళిక ననుసరించి ఈ గ్రంథ సంపాదకులుగా నుండ నంగీకరించి ప్రస్తావన విషయమును వ్రాసి పంపిన పూజ్యులు డా॥ వేటూరి చంద్రశేఖరశాస్త్రిగారికిని, ఆంగ్లమున గ్రంథ ప్రశంసనందించి తోడుపడిన శ్రీ వేటూరి ఆంజనేయులుగారికిని నమోవాకము లర్పించుచున్నాము.

ముఖపత్రము నందముగా తీర్చియిచ్చిన కళాకారులు శ్రీ శీలా వీర్రాజు గారికిని, ముఖపత్రమును ముద్రించిన నందినీ ఆర్ట్ ప్రింటర్స్‌వారికిని, గ్రంథ ముద్రణమును అచిరకాలములోనే ముచ్చటగా ముగించి యిచ్చిన మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్ వారికిని హార్దాభినందన లందించుచున్నాము.

విద్యార్థికు లీ నీతినిధి నాదరింపగలరని విశ్వసించుచున్నాము.

—ప్రకాశకులు

# సంపాదకీయము

శ్రీ నీతినిధి ఆంధ్ర గ్రంథమాలయం దాఱవ కుసుమము. గ్రంథ మాంగ్లగ్రంథమున కనువాదము. సుప్రసిద్ధ గ్రంథకర్తలు బ్రహ్మజ్ఞాన సంపన్నులు శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రులుగా రనువాదకులు. గ్రంథో దంతము మూలగ్రంథమునందున్న విధమున నిందుఁ బొందుపఱుపఁ బడినది. నీతినిధికి టీకను వ్రాయఁబూనుట భాస్కరునిఁ గరదీపికలతోఁ జూపఁబూను నటులుండును. అయినను నియతమైన బాధ్యతయే యీ ప్రయత్నమునకుఁ గారణము. అంతయును బంగారమైయున్నపు డేరి కోరి మెఱుఁగులను నిరూపించు టసాధ్యముగదా!

పూర్వకాలమునుండియును భరతఖండము బ్రహ్మ జిజ్ఞాసువులకు నిలయము. బ్రాహ్మణ క్షత్త్రియాదులు తపోనిష్ఠాగరిష్ఠులై బ్రహ్మజ్ఞానమే జీవయాత్రకు ఫలమని గ్రహించుచుండిరి. ఆ బ్రహ్మజ్ఞులందొక రీ గ్రంథమును సంస్కృతభాషయందు రచించిరి. "సంస్కృతగ్రంథము త్రివిష్టపమును జేరి త్రివిష్టపభాషారూపమును దాల్చినది. త్రివిష్టపభాషనుండి చీనాభాషానువాదమును బడసినది. చీనాభాషనుండి యాంగ్లభాషాంతరీకరణమును బొందినది." ఇయ్యది చెష్టరుఫీల్డు ప్రభువునకు చీనానుండి గ్రంథకర్త వ్రాసిన యుదంతము. ఇందుఁ గొంత సత్యమున్నను, గ్రంథరచనయందు గ్రంథకర్త భావములు విశేషముగఁ జేరియున్న విధమును గ్రంథపరిశీలనము విశదము చేయుచున్నది. క్రైస్తవమత సంప్రదాయములు, పలస్తీను ఈజిపు అరాబియాభివర్ణనములు, సముద్రోపమానములు భారతీయ బ్రహ్మజ్ఞాన సంప్రదాయములకుఁ బ్రతికూలముగను, క్రైస్తవమతసంప్రదాయముల కనుకూలముగను నున్నవి. క్రైస్తవ మతాభినివేశము, పాశ్చాత్యసంస్కారము గ్రంథమునందలి భావసాంకర్యము నకుఁ గారణమై యుండవోపును. గ్రంథము ప్రాచ్యవిజ్ఞానసంజాతమైనను, పాశ్చాత్యవిజ్ఞానసంజాతమైనను లేక యుభయ విజ్ఞానముల ఫలమైనను గ్రంథ రాజమై యాంధ్రభాషాయోష కొక యలంకారముగ నుండఁగలదు.

జీవయాత్రకు నీతి సాధనము; పురుషార్థము ఫలము. నరుఁడు నీతి సాధనమునఁ జతుర్విధపురుషార్థముల నారాధించుచు నారాయణపదము నధిష్ఠించుచున్నాఁడు. మానవులకు ధర్మార్థకామమోక్షములు కరతలామలకము లయ్యును దురారాధ్యములుగ నున్నవి. వేదములు, ప్రస్థానత్రయము, దర్శనములు, శాస్త్రములు, పురాణేతిహాసములు, మతగ్రంథములు, కావ్యములు, నాటకములు, నవలలు, పాటలు, పద్యములు పురుషార్థసిద్ధికి సాధనముల ననంతరూపముల నుపదేశించుచున్నవి. ఆ సత్యోపదేశములను నిత్యజీవనము నందు సమన్వయము చేసి పురుషార్థమును బడయఁగల విధమును నీతులు తెలుపుచున్నవి.

వివిధ మతములకును మోక్ష విషయమునందు భేదాభిప్రాయములున్నను నీతి విషయములందు భేదాభిప్రాయములు లేవు. సత్యము, శౌచము, శమము, దమము,దయ, వైరాగ్యము, త్యాగము మున్నగు సద్గుణముల నన్ని మతములును శ్లాఘించుచున్నవి. అహంకారము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము మున్నగు దుర్గుణముల నన్ని మతములును నిరసించుచున్నవి. దుశ్చింతలను, దుర్భాషలను, దుర్గుణములను, దుష్కార్యములను బాసి సచ్చింతలను, సద్భాషలను, సద్గుణములను, సత్కార్యములను బొందఁగలవిధమును నీతినిధి సులభముగఁ దెలుపుచున్నది. జీవయాత్రను స్వర్గయాత్రను జేయఁగల నీతిధర్మములను నీతినిధి విశదము చేయుచున్నది. సుఖప్రాప్తికిని దుఃఖనివృత్తికిని మూలాంకురములైన నీతిధర్మములను నీతినిధి సుగమము చేయుచున్నది.

నీతినిధియందు రెండుభాగములు కలవు. ప్రథమభాగమునం దేడును ద్వితీయ భాగమునం దైదును అధ్యాయములు గలవు. ప్రతి అధ్యాయము నందును మానవులకు భిన్నావస్థలం దవసరమైన నీతులు వివరింపఁబడి యున్నవి. సంసార ప్రవృత్తియందు, భిన్నావస్థలందు మానవుల కనుష్ఠాన యోగ్యము లైన నీతిధర్మము లీ చిన్నిపాత్రమునందుఁ జక్కఁగ నమర్చఁబడి యున్నవి. సంఘజీవనమునందుఁ బతులకు, సతులకు, తల్లులకు, బిడ్డలకు, చుట్టములకు, రాజులకు, ప్రజలకు వలయు నీతిధర్మము లిందు వివరింపఁబడి యున్నవి. మానవులు సకలావస్థలందును స్వధర్మనిర్వహణమును జేసి తరించు

టకు నీతిమార్గము శరణ్యము. నీతిధర్మపరాయణులు సుఖదుఃఖములను, లాభ నష్టములను, జయాపజయములను, కీర్త్యపకీర్తులను బాటింపక స్వధర్మ నిర్వహణమును జేసి కృతకృత్యు లగుచున్నారు. స్వధర్మ నిర్వహణమునకు సకల ధర్మములందును నాత్మధర్మము ప్రధానము. జీవయాత్రయందు మానవ ధర్మమును సార్థకము చేయుటకు నిత్యమైన యాత్మధర్మమువలెను. అనిత్యము లైన దేహేంద్రియ మనోధర్మములు ప్రయోజనకరములు గావు.

నిత్యమైన యాత్మధర్మారాధనమును జేయుటకు సాధనములైన నీతిధర్మ ములను ఆత్మానుభవము గల మహానుభావులు నిర్ణయింప సమర్థులు. నిత్యమైన పరతత్త్వము సర్వత్ర వెలుఁగుచున్నను నప్రత్యక్షముగ నున్నది. ఇంద్రియ గ్రామ మనిత్యమైన విషయవాసనలందు లగ్నమై పండితులనుగూడఁ బరవశులను జేయుచున్నది. అహంకార చతుష్టయము, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు విషయవాసనలనుండి మరలుటకును బరమాత్మలయందు లయమును బొందుటకును నీతిమార్గము సాధనముగనున్నది. మానవధర్మ నిర్వహణమునకును పురుషార్థసిద్ధికిని సాధనభూతములైన నీతిధర్మములతో నిండియున్న నీతినిధి సకలజనులకును— పండితపామరులకు, స్త్రీ పురుషులకు, బాలవృద్ధులకు— పారాయణయోగ్యముగ నున్నది. నీతినిధి బడులందును గృహములందును అనుదినమును జదువఁదగిన పుస్తకమై యున్నది. నీతినిధి ప్రతిమనుజునకును వెంటనుండఁదగిన ధర్మమిత్రము. ఆంధ్ర మహాజనులు నీతినిధిని బఠించి యందలి పరమార్థమును గ్రహించి శ్రీయుత ప్రభాకరశాస్త్రి గారి సంకల్పమును సార్థకము చేయుదురుగాక!

అక్షయ, వైశాఖ పూర్ణిమ,
చెన్నపురి.

కా. నాగేశ్వరరావు.



శ్రీ వాసిరెడ్డి శ్రీరామ గోపాలకృష్ణ మహేశ్వర ప్రసాద బహద్దరు గారు
ముక్త్యాల కుమారరాజాగారు

శ్రీరస్తు

# అంకితము

షహామత్ మర్తబత్ వా ఆలీ మంజులత్

మన్నెసుల్తాన్ సర్ దేశముఖ్ మన్నెవార్

సర్కార్ ముర్తుజాన్నగరు ప్రభృతి బిరుదాంకులును

శ్రీ ముక్త్యాలసంస్థానాధీశ్వరులును

అగు

శ్రీరాజా వాసిరెడ్డి

శ్రీ చంద్రమౌళీశ్వరప్రసాద బహద్దరు

వారి పుత్రరత్న మగు

శ్రీ రామ గోపాలకృష్ణ మహేశ్వర ప్రసాద బహద్దరు

కుమారరాజా వారిని

ఆయురారోగ్యవిద్యైశ్వర్యాభివృద్ధిగా

నాశీర్వదించి

వారి నవమవర్ష జన్మదినోత్సవమునకు జ్ఞాపకముగా

నీ నీతినిధిని

వారి కంకితము సేయుచున్నాడను.

వేటూరి ప్రభాకరశాస్త్రి

# పంచరత్నములు



శ్లో. శ్రీరమ్య! రామగోపాలకృష్ణ! భూపాలబాలక!
ఆరోగ్యవాన్భవాయుష్మాన్విద్యావాన్విజయీభవ

ఆ. వె. కులము వాసిగలది తలిదండ్రు లతిపుణ్య
చరితు లీవు వారివరుసవాఁడ
వెంచి నీకు సుకృతి నిచ్చితి హెచ్చుగా
మేలుగాంచుమా నృపాలబాల!

సీ. చిగురుటాకులఁబోలు చిన్నారి నీకేలు
దోయి సత్కృతు లెన్ని చేయవలెనో!
కలికిపల్కులగోము గల ముద్దు నీమోము
నెటి నెన్నివిద్యలు నేర్వవలెనో!
నెనరు చిప్పిలుచుండు నీ కన్నుఁగవ నిండు
సిరుల నెందఱఁ గటాక్షింపవలెనో!
అఖిలభాగ్యనిధాన మైన నీయాస్థాన
మింక నెంత సమృద్ధి నెసఁగవలెనో!

గీ. వంశదీపకుఁడైన నీవలన నింక
కులమునకు నెంత విఖ్యాతి కలుగవలెనో!
వృద్ధినందుమా యవియెల్ల వెల్లడింప
మహితతేజ! ముక్త్యాల కుమారరాజ!

సీ. తలిదండ్రు లఖిలభద్రములు గూర్పఁగ మేన
యత్తలు కనుఱెప్పలట్లు ప్రోవ
పినతండ్రి విద్యాభివృద్ధి కన్గొనుచుండ
మాతామహుఁడు రాజనీతి నరయ
మామ యల్లుని విని మదిలో ముదముచెందఁ
దక్కుబంధుగులు నుత్సాహమంద
గురుఁ డశ్రమమ్ముగా సకలవిద్యలునేర్పఁ,
జెలఁగి మాబోంట్లు నాశీర్వచింప

గీ. చక్కెపుక్షేత్రేశ్వరస్వామి సర్వశుభము
లొసఁగుచుండ నభ్యుదయంబు నొందుమన్న!
చంద్రమౌళి క్షమాపాల సత్కుమార!
శ్రీమహిత! రామగోపాలకృష్ణభూప!

సీ. సంస్కృతాంధ్రాంగ్లభాషలు నీకుఁ జక్కఁగా
వడివడిగా సలవడునుకాక!
పితృపాదు లభిమానవిద్యగాఁ గను వైద్య
మున నీకు నైపుణ్య మొనరుఁగాక!
తండ్రిధర్మంబు ముత్తాత ధర్మంబు నీ
వర్తనంబునఁ గూడి వచ్చుఁగాక!
రాచసంబంధంబు మా చల్లపల్లికి
నీచేత నిత్యమై నెగడుఁగాక!

గీ. ముట్టినట్టిదెల్ల ముత్యంబుగాఁ జేతఁ
బట్టినట్టి దెల్ల బంగరుగను
బొసఁగుఁగాక పూర్ణపురుషాయుషము నీకు
మహితతేజ శ్రీకుమారరాజ!

ఉ. ఎన్మిదియేండ్లు సాగి పర
మేశ్వరుసత్కృపఁజంద్రమౌళిభూ
భృన్మణి పుత్ర రత్న మభి
వృద్ధిదగన్ నవమాబ్దమందఁగా
జన్మదినోత్సవంబునను
జక్కఁగఁదీరిచి పద్యరూపముల్
పన్మతిఁ బంచరత్నము లొ
పంగెఁ బ్రభాకరశాస్త్రి కాన్కఁగాన్.



# తొలిపలుకు

శ్రీరగింపఁబోవువారికిఁ గూరరుచి చెప్పఁ బనిలేదన్నట్టు గ్రంథమును జదువ నున్నవారికి దానిఁగూర్చి ప్రశంసచేత యంతగా నావశ్యకముగాదు. నే నెఱిఁగినంతలో సంస్కృతాంధ్ర భాషలలో నిట్టి యుత్కృష్టనీతిగ్రంథము గానరాదు. మహాభారతాదులలో నింతకంటె నెక్కువగాఁగూడ నీతు లుండ వచ్చును; కాని యవియెల్ల నాను పూర్వితో నిం దున్నట్లు సందర్భితములుగా నుండవు. అంతేకాక యేదేశమునఁగాని యేకాలమునఁగాని యించుకేని మార్పునక్కఱలేకుండ సార్వత్రికముగా సార్వకాలికముగా నిలువఁదగిన విధమున నీతులిందు నిబద్ధములై యున్నవి. ఇతరంత్ర యిట్టితీరు గానరాదు.

క్రీ. 1751 సం॥ నుండి 1812 నాఁటికీగ్రంథ మాంగ్లభాషలో నేఁబది పర్యాయములు ముద్రితమయ్యెనట. మఱియు ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, వేల్సు మొదలగు దేశములం దాయా భాషలలోనికిఁ బరివర్తితమై బహుప్రచారము గాంచెనట. ప్రఖ్యాతులగు చిత్రకారు లీ గ్రంథవిషయములను బహువిధములఁ జిత్రించిరట. తేటగా సూటిగా సూక్ష్మముగా సుదృఢముగా జీవితనిబంధన ములఁ జెప్పుటలో నీగ్రంథ మద్వితీయమయినది. కావుననే యక్కడ నంత వ్యాప్తిఁజెందెను. సర్వమానవ సామాన్యముగాఁ బారాయణము చేయఁదగిన దీగ్రంథ మన్నంత యభిమానము నా కున్నది.

ఆంగ్లానువాదకారుఁడు ఛస్టర్‌ఫీల్డు ప్రభువకు వ్రాసిన యుత్తరమునుబట్టి మూలగ్రంథోపలబ్ధికథ తెలియవగును. ప్రాచీనుఁడగు బ్రాహ్మణుఁ డా గ్రంథము రచించెనని యాతఁడు వ్రాసినాడు. అది యే భాషలోనున్నదో యాతఁడు స్పష్టముగాఁ జెప్పఁడయ్యెను. 1749 సంవత్సరమునకు దుర్గమమై దుర్జ్ఞేయమైయున్న తిబెటుదేశమున, పొటలా పర్వతాగ్రముననున్న లామా మఠమును నేఁడు సుగమమై సుజ్ఞేయమై యున్నవి. అక్కడ సురక్షితమై యున యా మూలగ్రంథము మనకు దొరకెనేని తత్త్వమెఱుఁగఁ గల్గుదుము.

ప్రాభవము గలవారు దానికై ప్రయత్నింపఁ దగుదురు. ప్రాయికముగా నది బౌద్ధగ్రంథమై యుండునని నేను దలంచుచున్నాఁడను. ఈ గ్రంథమం దక్కడక్కడ అరేబియా ఐజిప్టు దేశముల పేళ్లున్నవి. బ్రాహ్మణుఁడు రచించినాఁ డనుటకు బలిష్ఠము లయిన సాధకములుగాని బాధకములుగాని యిందుఁ గానరావు. కాని యీ క్రింది వాక్య మార్యుఁ డెవ్వఁడు ననఁగూడనిదిగా నున్నది.

"అది (ఆత్మ) నీవు పోయినపిమ్మటఁగూడ జీవించినను నీవు పుట్టుటకుఁ బూర్వముగూడఁగల దనుకొనకుము. నీ దేహముతో నదియు సృష్టింపఁబడినది. నీ పేగులతో నదియుఁ బెఱిగినది."

క్రైస్తవుఁడగు నాంగ్లానువాదకారుఁడు స్వమత సిద్ధాంతానుగుణముగా నీ వాక్యమును మార్చెనో లేక చేర్చెనో యని నేను సంశయించుచున్నాఁడను. ఇఁక నంతగా నార్యమత విరోధములగు విషయము లిందు లేవు.

మన్మిత్రులు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రొకప్పుడు ఆంగ్ల భాషలోనున్న యీ గ్రంథము నెఱిఁగించి తెలిఁగింప నన్నుఁ బ్రోత్సాహపఱిచిరి. ఆంగ్లభాష నేరనివాఁడ నయినను నే నాగ్రంథమును గొంత చదివించుకొని విని దాని యుత్కృష్టత కచ్చెరువంది తెలిఁగింతునుగాక యని పూనితిని.

అప్పుడే బి.యే. ప్యాసయియున్న యొక మిత్రునిచేఁ బయిగ్రంథము నకుఁ దెలుగుటీక వ్రాయించుకొంటిని. వారు వ్రాసిన యాటీక మూలమును గొంతవఱ కర్థముచేసికొనుటకు మాత్రమే నా కుపకరించెను. దానిని జేత నుంచుకొని మా తమ్ముఁడు చిరంజీవి—చంద్రశేఖరశాస్త్రి (ఎల్.ఎమ్.పి.) తోడ్పాటుతోఁ గ్రొత్తగాఁ దీర్చి దిద్ది నే నీ తెలుఁగు రచనము చేసితిని. మూలానుగుణముగానే యీ తెలుఁగుచేత యుండును. నా కాంగ్లభాషరామి గ్రంథము నర్థము చేసికొనుటలోఁ గొంత యనర్థకమే యయినను, వాక్య రచన చేయుటలోఁ దెలుఁగుదనమును వెలయించుటకుఁ గొంత సార్థకమే యయ్యె ననుకొనుచున్నాఁడను. సంస్కృతభాషలోనికిఁగూడ దీని నిఁకఁ బరివర్తింతును.

ఇంగ్లీషున దీనికి 'The Economy of Human Life' అనిపేరున్నది. "మానవజీవిత నిబంధనము" అనుట దానికి సరియయిన తెలుఁగయినను, ఆ పేరంత పసిగాలేదని 'నీతివిధి' యని మార్చితిని. మన ప్రాచీను లిట్టి గ్రంథములను నీతిశాస్త్రగ్రంథము లనిరి. కావున నేను బెట్టినపేరు దూషితము గాదని నా యుద్దేశము. నా రచనమునందలి గుణదోషములకు ప్రాజ్ఞులు ప్రమాణము.

ముక్త్యాల సంస్థానాధీశ్వరు లగు శ్రీ రాజా వాసిరెడ్డి శ్రీ చంద్రమౌళీ శ్వరప్రసాద బహద్దరువా రీగ్రంథమును జాలఁగా జిత్తగించి తమ పుత్త్రి రత్నము పేర నంకితముసేయ నంగీకరించి ముద్రణాదులయందు నాకు సర్వ సౌకర్యమును గలిగించిరి. బ్రహ్మశ్రీ దేశోద్ధారక కాశీనాథ నాగేశ్వరరావు పంతులుగారు తమ గ్రంథమాలలోఁ బ్రకటించి మిక్కిలిగాఁ దోడ్పడిరి. ఈ యిర్వురియెడ నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

అక్షయ తృతీయ
14—5—26.

వేటూరి ప్రభాకరశాస్త్రి.

# ఉత్తరము

ఆంగ్లానువాదకారుఁడు చస్టరు ఫీల్డు ప్రభువుకు
(The Earl of Chester field) వ్రాసిన యుత్తరము

పెకిను, మే. 12 తేది 1749

అయ్యా,

1748 సంవత్సరము డిసెంబరు 23 తేదీని క్రిందటి తూరి మీకు వ్రాసిన యుత్తరమున నీ సామ్రాజ్యపు స్థలనిర్దేశమును గూర్చియు స్వభావ చరిత్రమును గూర్చియు తెలుపవలసిన విషయములను ముగించితి ననుకొనె దను. ఈ యుత్తరమందును నిఁక మీఁద వ్రాయఁబోవు నుత్తరములందును, నిక్కడి చట్టములు, పరిపాలన, మతము, ప్రజల సంప్రదాయములు, మొద లగు వానినిగూర్చి నాకు గోచరించిన విషయములను గొన్నింటినివ్రాయ నుద్దే శించితిని. యిటీవల నిక్కడి విద్యాధికుల సల్లాపములనెల్ల స్వాధీనపఱచు కొనఁగల్గిన యత్యద్భుత విషయమొకటి సంప్రాప్తమయినది. ప్రాయికముగా నిది యిఁకముందు ఐరోపాలోని పండితులకుఁగూడ నాలోచనావిషయమై వెలయ వచ్చును. ఆ నూత్నవిషయము తమకుఁ గొంత సంతోషమును గలుగఁజేయఁ గలుగునని నాకుఁ దోఁచుటచే నుపలబ్ధమైనంతవఱకు స్పష్టముగాను సమగ్రము గాను దానిని మీకు నివేదించుకొనుచున్నాఁడను.

చీనా సామ్రాజ్యము నానుకొని పడుమటిదిక్కున తిబెటు అనియుఁ గొందఱచే బారన్‌టోలా అనియుఁ బేర్కొనఁబడునట్టిది పెద్దదేశము గలదు. ఆ దేశమున లాసా యని పేరుగల రాష్ట్రమందు, ముఖ్యుఁడయిన లామా (ప్రధానమతాచార్యుఁడు) కలఁడు. ఇరుగుపొరుగు దేశములవా రనేకజాతులవా రాయనను శ్రద్ధాభక్తులతో నారాధించుచు నుందురు. అక్కడి విగ్రహార్చకుల కాయన ప్రధానాచార్యుఁడు. ఆయన పవిత్రచరిత్రమునెడ నత్యంతాదరము గలవారై యనేకులు మతాభిమానులు లాసాకువచ్చి యాయన నారాధించి యాయనచే నాశీర్వచనము లంది పోవుచుందురు. పొటలాపర్వతాగ్రమున నతిరమణీయముగాఁ గట్టఁబడిన యొక మఠమున నాతఁ డుండును. ఆ పర్వ తముక్రిందను, లాసారాష్ట్రమునను, వేలువేలు సంప్రదాయములుగలవారు

మతాచార్యులు పలువురు గలరు. వారిలోఁ బలువురకు వారి గౌరవమునకుఁ దగినట్లు కట్టింపఁబడిన మఠములు పెక్కులున్నవి. అందు వా రారాధింపఁ బడుచుందురు. ఇటలీదేశమువలె నా దేశముగూడ మతాచార్యులతో నిండి యుండును. టార్టరీదేశపు భాగము లన్నింటనుండియు, మొగలాయి చక్రవర్తి రాజ్యమున నుండియు, తూర్పు దిక్కునఁగల యన్నిభాగముల నుండియుఁ బంపఁబడు ననర్ఘ సత్కారములచే వారు మహాదశ ననుభవించుచున్నారు. ముఖ్యుఁడగు లామా (మతాచార్యుఁడు) పూజాపురస్కారములందు నపుడొక దివ్యపీఠముపయి మృదువయిన పఱుపుమీఁద బద్మాసనమునఁ గూర్చుండును. ఆయన నారాధించు శిష్యులు దీనదీనముగాఁ బ్రస్తుతించుచు, మిక్కిలి యడఁకువతో సాష్టాంగముగాఁ బాదములపైఁ బడి ప్రణమిల్లుదురు, కాని యాయన వారియెడ నణుమాత్రమేని ప్రత్యాదరముఁ జూపఁడు. గొప్ప రాచబిడ్డల నయినను నాతఁ డెప్పుడును బలుకరింపఁడు. వారి శిరములపైఁ దనహస్తము నుంచును. దానితో వారు తమ పాపము లెల్లఁ బటాపంచలైన వని తలియుదురు. తమ హృదయగతములయిన రహస్యములనుగూడ నాతఁ డెఱుఁగునని నమ్మునంత యమాయికతతో వా రాయన నారాధించుచున్నారు. ఆ మతాచార్యులలో నభ్యర్హితు లయినవారు రెండువందలమంది ముఖ్యుఁడయిన యా లామాకుఁ బ్రధాన శిష్యులుగా నున్నారు. వా రాయన శాశ్వతముగా జీవించువాఁ డనియు నెన్నఁ డయినఁ జనిపోవునట్టి కన్పట్టినను నది ప్రాఁతదేహమునువదలి క్రొత్తదేహమును జేరఁబోవుటయనియుఁ బ్రజలకు నమ్మకము కల్గునట్లు చెప్పుచుందురు.

ప్రధానుఁడగు నా లామా వసియించు మఠమునఁ బ్రాచీన గ్రంథాలయములు గలవనియు వానిలోఁ బహుపురుషాంతరములనుండి యెవ్వరికిని దెలియకుండఁ బెక్కు మహాగ్రంథములు గుప్తములయి యున్నవనియు, చీనాదేశపు విద్వాంసులు బహుకాలమునుండి తలంచుచుండిరి. ఇప్పుడు చీనాదేశమును బరిపాలించుచున్న సార్వభౌముఁడట్టి ప్రాచీనగ్రంథములను బరిశోధింపించుటలో వేడుకగలవాఁడు. కాలక్రమమున నాతని కీవిషయమున నభినివేశ మధికము కాఁగాఁ బ్రఖ్యాతములుగాని ప్రాచీనగ్రంథములేవైన బయల్పడునేమో యని వెదకింప నిశ్చయించెను. ప్రాచీనభాషలు మాటాడుటలోను వ్రాయుటలోను సమర్థుఁడగు విద్వాంసునిఁ గనుఁగొను టాతనికిఁ బ్రథమకర్తవ్య మయ్యెను. కొలఁది కాలమునకే యాతఁడు కెయోటున్ అను పేరుగల పండితప్రకాండు

నొకని నీ కార్యమునకై నియోగించెను. ఆ పండితుఁ డిప్పటికి దాదాపుగా నేఁబదియేండ్ల యీడుగలవాఁడు. గంభీరమయి దీర్ఘలోచనా పటుత్వమును సూచించు ముఖముగలవాఁడు. మంచి వాగ్ధాటిగలవాఁడు. లాసా దేశీయుఁడును విద్యావంతుఁడును నగు నొక మతాచార్యుఁడు పెకిన్ పట్టణమునఁ బెక్కు వత్సరములనుండి నివసించుచుండఁగా నీ పండితుఁ డతనితో యాదృచ్ఛికముగా మైత్రిని బడసి తిబెట్టుదేశములోని మతాచార్యులు మాటాడుకొనుభాషలోఁ బరిపూర్ణమగు పాండిత్యమును సంపాదించెను.

ఇట్టి యోగ్యతలు గలవాఁ డీపండితుఁడు తిబెట్టుదేశమునకుఁ బ్రయాణమయ్యెను. ఈతఁడు చేయవలసిన పనికిఁ బ్రాముఖ్య మేర్పడుటకై యా సార్వభౌముఁడు ప్రధానమంత్రియను బిరుద మీతని కొసఁగెను. ఈతని వెంటనే దేదీప్యమానము లగు దుస్తులను ధరించిన సిబ్బందిని, సేవకులను, బంపెను.

అక్కడి ప్రధానుఁడగు లామాకును, ఇతర మతగురువులలో నెన్నికగన్నవారలకును, ననర్ఘము లయిన కానికల నంపెను. ఇవిగాక స్వహస్తాక్షరములతో నీ క్రింది విధముగాఁ బ్రధానుడగు నా లామా కొక యుత్తరము నంపెను.

"భగవంతుని ప్రతినిధులయి, ఆత్యౌన్నత్యము, నతిపవిత్రతయుఁ గాంచి పూజనీయు లయిన పుణ్యాత్ములకు:—

"రాజాధిరాజుల మయి చీనాసామ్రాజ్యమునకు సార్వభౌమత్వము వహించిన మేము మాచే నధికముగా గౌరవింపఁబడు కెయాట్సా యను ప్రధానమంత్రి ద్వారమునఁ దమ పవిత్రపాదములకు భక్తితోను బ్రపత్తితోను సాష్టాంగ ప్రణామము లాచరించి, మాకును, మా మిత్రులకును, మా సామ్రాజ్యమునకును, నమోఘమై కరుణార్ద్రమై వెలయు తమ యాశీర్వచనముల ననుగ్రహింతురుగాకని విధేయులమయి వేఁడుచున్నారము."

"పురాతన గ్రంథములఁ బరిశోధించి పెక్కు పురుషాంతరములనుండి మఱుఁగుపడియున్న విజ్ఞానమును నేర్చుకొని, దానిని పునరుద్ధారము చేయవలయునను కోరికతో మేము, సామాన్యులకేకాక విద్యావంతులకుఁగూడఁ

ప్రాచీనతచే మిగుల నస్పష్టములయిన యమూల్యగ్రంథములు గొన్ని యనాదిసిద్ధమయి యారాధనీయమైయున్న తమయాచార్యాధిపత్యమునకు సంబంధించిన పవిత్రగ్రంథాలయములందుఁ గలవని లెస్సగా నెఱిఁగి శక్యమగునంతవఱకు వానిని సంరక్షించుటకయి, పవిత్రతచేఁ బ్రాభవముగాంచిన తమ సన్నిధానమున కధికారమిచ్చి, విద్యాధికుఁడును మాననీయుఁడును నగు కెయాట్సా అను మా ప్రధానమంత్రిని బంపుట యుక్తమని తలంచి యట్లు చేసితిమి. ఆయన ప్రాచీనభాషలందుఁ గల పాండిత్యాతిశయముచే నెట్టి ప్రాచీనగ్రంథములనేని పరిశోధించి వ్యక్తపఱుపఁగలఁడని తలఁచి యట్టివానిని జదువుటకును, బరిశీలించుటకును దమ యనుమతిని బడయఁగోరుచుఁ బంపుచున్నాము. మేము వేఁడిన విషయమున మీ రనుమతి నొసఁగుటకు మీయెడల గౌరవమును బ్రకటించు మా స్వభావము వ్యక్తమగునట్లు మీ పాదములకు సాష్టాంగముగా మ్రొక్కవలసినదని యాయనను మే మాజ్ఞాపించితిమి."

అనేక విచిత్రవిషయములతోఁ గూడియున్న తన ప్రయాణపు సమగ్రచరిత్ర నా పండితుఁడు ప్రకటించెను. కాని యా విషయములను వేనినేని వివరించి యిప్పుడు మీకుఁ గాలహరణము గావింపను. నే నింగ్లండునకుఁ దిరిగివచ్చినప్పు డావిషయముల నన్నింటిని, ప్రాయికముగా నాంగ్లభాషలోనికిఁ బరివర్తించి ప్రకటించెదను. ఆ పండితుఁ డాపుణ్యదేశమునకుఁ జేరినతోడనే యాతఁడు కొనిపోయిన కానికల యనర్ఘతయే యాతనిప్రార్థన కనుజ్ఞ నిప్పించెనని తెల్పుట యిప్పటికిఁ జాలును.

మహోత్కృష్టమగు నామఠాచార్యుని మఠమునందే యా పండితునకు విడిది యేర్పఱుపఁబడెను. గొప్ప విద్వాంసుఁడగు నొకమఠాచార్యుఁ డతనికి వలయు సాహాయ్యముఁ జేయుటకై నియమితుఁ డయ్యెను. దాదాపుగా నాఱు నెల లాతఁ డక్కడనుండెను. బహు పురాతనములును మహోత్కృష్టములును నగు గ్రంథముల నెన్నింటినో యాతఁ డప్పుడు కనుఁగొనఁ గలిగెను. వానిలో గొన్నింటనుండి ప్రశస్తములగు భాగములను గొన్నింటిని గ్రహించి వానినిబట్టి వానిని రచించినవారెవరో వారి దేశ కాలములేవో యాతఁడు నిర్ధారణచేసెను. ఆ నిర్ధారణములనుబట్టి యాతఁడు కుశాగ్రబుద్ధియనియు, గొప్ప వివేచనశక్తి గలవాఁడనియుఁ, జాలఁగాఁ జదువుకొన్నవాఁడనియు నెఱుఁగ నగుచున్నది.

పూర్వపు జిమ్నోసోఫిస్టులయో, లేక బ్రామినులయో (బ్రాహ్మణులు) భాషలో రచితమై పెక్కు తరములనుండి యేమతాచార్యునకుఁగూడ నెఱుకపడకున్న చిన్న నీతిశాస్త్రగ్రంథమొకటి యాతఁడు కనుఁగొన్నవానిలోనికెల్ల బహు పురాతనమయినది. కాని యా గ్రంథమునకు రచయిత యెవ్వఁడో యేనాఁటివాఁడో యాతఁడు నిర్ణయింపఁ జాలఁడయ్యెను. ఆ గ్రంథము నాతఁడు సంపూర్ణముగాఁ జీనాభాషలోనికిఁ బరివర్తించెను. కాని యా పరివర్తనమునకు మాతృకకుఁగల భావసౌష్ఠవము, రచనాసౌందర్యము, గొంత కొఱఁతపడియే యుండునని యాతఁడే చెప్పుకొన్నాఁడు. బాంజీలును, మఱి యితర విద్వాంసులును నీ గ్రంథమును గూర్చి భిన్నాభిప్రాయములు గలవారై యున్నారు.

మిక్కిలిగా దీనిని మెచ్చుకొనుచున్నవారు తమదేశపు మహావేదాంతియగు కాన్ఫ్యూపియస్ దీనికిఁ గర్తయని యత్యుత్సాహముతో ననుచున్నారు. కాన్ఫ్యూషియస్ గ్రంథకర్త యగునేని గ్రంథము చీనాభాషలో నుండవలెను, దానికి వారు కాన్ఫ్యూషియస్ రచియించిన మూలగ్రంథమిప్పుడు నశించిపోయినదనియు, ప్రాచీనకాలపు బ్రామినుల (బ్రాహ్మణుల) భాషలోనికది పరివర్తితమయ్యె" ననియుఁ జెప్పుదురు. పెయస్సీయను వర్షమువారి నేర్పఱిచినవాఁడును, కాన్ఫ్యూషియస్‌కు సమకాలమువాఁడునునగు లాకియన్ అను వేఱొక చీనాదేశపు వేదాంతి దీనిని రచియించెనని మఱికొందఱందురు. కాని వీరుగూడ కాన్ఫ్యూషియస్ రచియించెనని యనువారివలెనే గ్రంథభాషావిషయమునఁ జిక్కులోఁ జిక్కుకొనుచున్నారు. గ్రంథమందుఁ గానవగు ప్రధానవిషయములను గొన్నింటినిబట్టియు, భావములను గొన్నింటిని బట్టియు, నిది యైరోపియనులచేఁ బదిలపఱుపఁబడి ప్రఖ్యాతిగాంచిన యుత్తరమును అలగ్జాండరు చక్రవర్తికి బహుకాలమునకుఁ బూర్వము వ్రాసియుండిన డాండమిన్ అను బ్రామినుని (బ్రాహ్మణుని) చే రచితమయినదని 'మఱికొందఱనుచున్నారు. కెయాటూన్కూడ నీ కడపటి మతము నొప్పుకొనునట్టు కన్పట్టుచున్నాఁడు. ఆది ప్రాచీనకాలపు బ్రామినులలో నొక్కనిచే రచియింపఁబడెననియు, రచనాసౌష్ఠవమునుబట్టి చూచిన నది యనువాదముఁ గాదనియు నాతఁడనుచున్నాఁడు. ప్రాగ్దేశవాసుల తా గ్రంథరచనావిధానము కేవలము క్రొత్తరీతిదిగాఁ గానవచ్చుచుండుటచేత గ్రంథకర్తనుగూర్చి వారెట్టి నిర్ణయమును

జేయఁజాలకున్నాఁడు. ప్రాగ్దేశవాసులవేయని చెప్పఁదగిన పలుకుబళ్లు కొన్ని లేకుండెనేనియును, ప్రాచీనమయిన బ్రామినులభాషలో లేకుండె నేనియును బలువురు దీని నొక పాశ్చాత్యుఁడు రచించియుండునని యూహించి యుందురు.

గ్రంథకర్త యెవ్వరయినను నీ పట్టణమందును నీ సామ్రాజ్యమందును ప్రజ లీ గ్రంథమును బ్రశంసించుచుండుటచేతను, అన్ని జాతులవారును నాసక్తితోఁ జదువుచుండుటచేతను, అందును గొందఱు మిక్కిలి యెక్కువగా మెచ్చుచుండుటచేతను ఆంగ్లభాషలోనికిఁ బరివర్తనముచేసి మీ కర్పించి మిమ్ము సంతోషపఱుపవలెనని నిశ్చయించుకొని కాలక్రమమున నట్లుచేయుటకుఁ బూనితిని. మాతృకకుఁగాని చీనాభాషలోని పరివర్తనమునకుఁగాని నా రచన మెంత వెనుకఁబడియుండునో మీరు తెలిసికొనఁజాలరుగదా యని నేనిట్లు సాహసించితిని. పరివర్తన రీతికిని భాషాశైలికిని క్షమింపవలసినదిగా మిమ్ము నేను వేడుచున్నాఁడను. తొలుత నుపక్రమించినప్పు డీవిధముగా రచింపవలయునని నే నుద్దేశింపలేదు. కాని యుపోద్ఘాతమందుఁగల యాలోచనాపటిష్ఠత, భావప్రకటనశక్తి వాక్యముల సంక్షిప్తత నన్నట్టి శయ్యకుఁ దార్చినవి. మన జాబ్ పుస్తకము, ప్రార్థనగీతములు, సాలమనురచనలు, మతాచార్యుల రచనలు,తత్తుల్యసౌభాగ్యముగల యీ గ్రంథము ననువదింప దొడఁగొన్న నాకుఁ గొంత సౌకర్యమును గలిగించినవి.

ఇట్టి యీ గ్రంథము మీకు ముదముగూర్పఁగల్గినచో నే నానందభరితుఁడ నగుదును. ఇంకొకతూరి యిచ్చటి ప్రజలఁగూర్చియు సామ్రాజ్యమును గూర్చియు మిగిలిన విషయములఁ దెలుపుకొందును.

ఇట్లు,

....................

# ప్రజాసామాన్యమునకై ప్రకటన
## (ఆంగ్లముద్రణమున)



ఎవని సంతోషము కొఱకయి యీ గ్రంథ మాంగ్లభాషలోనికిఁ బరివర్తితమై పంపఁబడినదో యాతఁడిది సౌశీల్యమును సద్వర్తనమును స్పష్టీకరించుచు, పటిష్ఠములు, భావపూరితములు, సంక్షిప్తములునగు వాక్యములుగలిగి పాఠకులకు మేలుగూర్పఁ జాలియున్న దని నమ్మి ప్రజాసామాన్యమునకై ప్రకటింప నుత్సహించెను.

ఈ గ్రంథమును బ్రకటించు నాతని నామధేయమును, వాఙ్మయవిషయమునఁ గ్రొత్త విషయములను గనుఁగొనుటకుఁగాక యితర కార్యములకై నియమితుఁడై చీనాదేశమునఁ బెక్కు వత్సరములనుండి నివసించుచుండిన యీ యాంగ్లానువాదకారుని నామధేయమును, నేఁడు గుప్తములుగా నుండుటయే యుక్తమనుటకుఁ దగ్గ కారణములు కొన్ని యున్నవి. ఈ కారణము లెక్కువ కాలము నిలిచి యుండవు. ఇంగ్లండునకుఁ దిరిగివచ్చి కేయాట్సా ప్రయాణచరిత్రమున కాంగ్లభాషానువాదము నీయనువాదకారుఁడు ప్రకటింప నున్నట్లు తెలిపినాఁడు. అట్లు ప్రకటించినపుడు ప్రజలు తాము తెలిసికొనఁ గోరు సర్వవిషయములను దెలిసికొనుటకు వీలుపడును.



# ప్రస్తావన

నీతినిధి ఒక ప్రశస్తమైన ఉద్గ్రంథం. ఇది పరిమాణంలో కొద్దిదే అయినా ప్రభావంలో మాత్రం గొప్పది. ఈ గొప్పగ్రంథం పునర్ముద్రణ పొందుతున్న సందర్భంలో ఇప్పుడు నేనీ నాలుగు పంక్తులూ వ్రాయబూన డానికి ప్రధానకారణం చిరంజీవి ఆనందమూర్తి కోరికను కాదనలేకపోవడమే. శ్రీ ప్రభాకర సంపూర్ణగ్రంథావళి ప్రకటన కుద్యమిస్తూ అందు తొలిపంపు టంగా నీతినిధి నెన్నుకొని నామీది ఆదరం చేతనూ, ఆ గ్రంథంతో నాకూ కొంత సంబంధమున్నదన్న హేతువు చేతనూ కావచ్చును ఆనందమూర్తి నన్నీ ప్రస్తావన వ్రాయగోరినాడు. అంగీకరించినాను. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి మెమోరియల్ ట్రస్టును రూపొందించి దాని పక్షమున ఇప్పుడీ నీతినిధిని ముద్రించడము మెచ్చుకోదగిన విషయము; అవసరము కూడాను. ఈశ్వరాను గ్రహమున ఈ ఉద్యమము నిరంతరాయముగా కొనసాగగలదనీ, దానికి అన్నివిధాలా అందరి తోడ్పాటు లభించగలదనీ ఆశిస్తున్నాను.

ఈ నీతినిధి ఒక ఆంగ్లగ్రంథానికి తెనిగింపు. ఆ ఆంగ్లరచన కూడా మూలరచన కాదు. అదీ చీనాభాషలో లభ్యమైన ఒక గ్రంథానికి అనువాదము. ఆ చీనాభాషా గ్రంథమూ మూలరచన కాక అదీ మరొక మూలభాషా రచనకి అనువాదంగా తెలియవస్తున్నది. ఇంతకూ ఈ రచన మౌలికంగా ఎప్పుడు ఏ భాషలో వెలువడిందో దాని మూలకర్త ఎవరోకూడా స్పష్టంగా మనకిప్పుడు తెలియరావడం లేదు.

ఏ మహాపురుషుడో ఎన్నడో ఎక్కడో వ్రాసిన ఈ గ్రంథం కాల గర్భంలో మరుగుపడి టిబెట్టు, చైనా దేశాలలో ఆయాభాషలలోనికి అనువదింప బడి నిలువర మందియుండినట్లు తెలుస్తున్నది.

చెస్టరుఫీల్డు ప్రభువుకి సంబంధించిన ఒక ఆంగ్లేయుడు 18వ శతాబ్ది మధ్యభాగంలో చైనాలోని గ్రంథాలయంలో చీనాభాషలో కానవచ్చిన ఈ

గ్రంథాన్ని చూసి ఆకృష్టుడై "Economy of Human life" అనే పేరుతో దాన్ని ఆంగ్లభాషలోనికి అనువదించి చెస్టరుఫీల్డు ప్రభువునకు పంపెను.

ఇంగ్లండు దేశంలో అచ్చుపడి ఈ గ్రంథం బహుళ ప్రచారం పొందినట్లు, దరిమిలా అనేక యూరోపియన్ భాషలలోకి పరివర్తితమై ప్రసిద్ధికెక్కినట్లు తెలియవస్తున్నది.

ఈ గ్రంథపు ఆంగ్లానువాద ప్రతులూ మనదేశంలో ఏ కొద్ది గ్రంథాలయాలలోనో అరుదుగా మాత్రమే ఉన్నట్లు తెలుస్తున్నది.

బహుగ్రంథ పరిశోధకులు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ఈ గ్రంథ ప్రతి నెక్కడో చూచి దాని పాశస్త్యాన్ని శ్రీ ప్రభాకరశాస్త్రిగారి కెరిగించి దాని నంగీకరింప వలసినదిగా కోరగా, నైతిక విషయాలలో ప్రత్యేక శ్రద్ధాళువులైన శాస్త్రిగారు శ్రీ వేపా రామేశంగారిద్వారా అడయారు లైబ్రరీలో నున్న Economy of Human Life అనే ఆ గ్రంథాన్ని వెంటనే తెప్పించి అందలి కొన్ని భాగాలను నాచేత చదివించుకొని, ఆంగ్లభాష అంతగా రాకపోయినా తమ సహజప్రతిభచేత భావాన్ని గ్రహించి పరితోషపడి మక్కువతో దానిని తెనిగించుట కుద్యమించారు.

అప్పుడే కొత్తగా బి.ఏ. పాసై నిరుద్యోగిగా ఉన్న యువకుడొకడు శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారితోపాటు ప్రతివిలేఖకుడుగా పనిచేయడానికి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారానికి వచ్చి, ఆయన మూలంగానే పరిచితుడై యుండెను. ఆ యువకునిచేత ప్రభాకరులు ఈ గ్రంథానికి తెలుగులో టీక తయారు చేయించారు. (అతని పేరేమో నాకిప్పుడు గుర్తులేదు.) ఆ టీకని తనదగ్గర పెట్టుకొని ఆంగ్లమూలాన్ని నేను చదివి వినిపిస్తూ దాని భావాన్ని తెనుగులో వివరించగా నా వివరణాన్ని తమవద్దనున్న టీకతో సమన్వయించి

మూలభావాన్ని, తెలుగు నుడికారానికి తగినట్లుగా ఆయన వాక్యరచనని కొత్తగా వెలయించి తమ సహజ సరళశైలిలో నీతినిధిని రచించినారు.

అజ్ఞాత వాఙ్మయ పరిశోధకులైన శ్రీ ప్రభాకరుల కలంనుండి అట్లు వెలువడిన యీ రచన ఆంగ్లమూలంలోని భావాన్ని చక్కగా సుస్పష్టంగా విశదీకరించడమేకాక స్వతంత్ర రచనవలె చదువరుల హృదయాలకు హత్తుకు పోయేవిధంగా సాగింది. ఈ ప్రశస్త గ్రంథరచనలో అప్పుడు నేనాయనకు ఒనగగల్గిన తోడ్పాటు బహుస్వల్పమైనదైనా అది నా అదృష్ట విశేషమని సంతసిస్తూ ఉంటాను.

ఈ నీతిగ్రంథం సాధుశీలురగు ప్రభాకరుల దృష్టి నాకర్షించడం, ఆయన దీనిని ప్రత్యేకాభిమానంతో తమ సహజ మధుమయ ఫణితిలో అనువదించడం ఆంధ్రుల అదృష్టమని నేను భావిస్తున్నాను.

ఈ గ్రంథప్రాశస్త్యాన్ని గుర్తించి దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వర రావు పంతులుగారు దీనిని తమ ఆంధ్రగ్రంథమాలలో అయిదవ కుసుమముగా స్వీకరించి సంపాదకీయము వ్రాశారు.

సారస్వతప్రియులు ఉదారులు అయిన ముక్త్యాల ప్రభువులు రాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదుగారు తమకుమారుని నవమ జన్మదినోత్సవం సందర్భాన ముక్త్యాల రాజమందిరంలో జరిగిన పండితసభకు శ్రీ ప్రభాకర శాస్త్రిగారిని ప్రత్యేకంగా ఆహ్వానించి వారినుండి ఈ గ్రంథాన్ని తమ కుమారుని పేర అంకితముగాగొని ప్రభాకరశాస్త్రిగారిని, ఆహూతులైన ఇతర ప్రముఖుల్ని ఘనంగా సన్మానించారు.

ఆ సమయంలో ప్రభాకరశాస్త్రిగారు తమ ఆశీర్వచన పద్యరూపములను పంచరత్నములతో పాటు ఈ గ్రంథరత్నాన్ని కూడా వారికి కానుకగా సమర్పించారు.

ఈ గ్రంథం ప్రథమముద్రణ ప్రతులు శీఘ్రింలోనే ఖర్చైపోవడం రెండవ ముద్రణ వెంటనే జరుగక పోవడంవలన ఈ మధ్యకాలంలో ఈ గ్రంథానికి ఉండతగినంత ప్రాచుర్యం లేకపోయింది. ఈ లోపాన్ని పూరిస్తూ శ్రీ ప్రభాకర పరిశోధకమండలివా రీగ్రంథ ద్వితీయముద్రణ ఇప్పటికైనా తలపెట్టడం ముదావహం.

సార్వత్రికములు, సార్వకాలికములు అగు ధర్మములు ఈ గ్రంథమున వివిధ శీర్షికలక్రింద సుబోధములుగా పొందుపరుపబడినవి.

రచయిత ప్రతిబింబమే రచన. అనగా రచయిత భావాలను ప్రస్ఫుటంగా విశదీకరించేదే ప్రశస్తరచన. నీతినిధి రచన అనువాదమైనా శాస్త్రిగారి భావాలు మూలంలోని భావాలతో తాదాత్మ్యం చెంది వాటికి పరిపుష్టి కల్పించి ప్రస్ఫుటమై పాఠకుల హృదయాలను స్పందింపజేసేవిధంగా ఉన్నవి. అనువాద విధానంలోనూ మాతృభాషా రచనా పారమ్య మెరిగిన శాస్త్రిగారి వచన రచన మూలంలోని పదాంశ పదబంధాల స్థాయిని, వాక్య పరిధుల్ని అధిగమించి, సందర్భశుద్ధిగల సామ్యసిద్ధితో ముక్తకాలనదగిన మూల వచన ఖండికలలోని భావసౌకుమార్యాన్నంతా వెలార్చే తీరున మూలవిధేయమవుతూనే మూలాతిశాయిగా ఉంటూ, అనువాదమైనా స్వతంత్ర రచనగా సహృదయ హృదయావర్జకంగా సాగింది. ఒక్కమాటలో చెప్పాలంటే ఆంధ్రీకరణ కార్యమాద్యంతమూ ఇదే మూలమా అన్నంత రమ్యంగా సాగింది : సామ్య పరిశీలనకీ గ్రంథావతరణికలోని ఉదాహరణలే చాలనుకొంటాను.

"He sitteth on his throne in the centre and the breath of his mouth giveth life to the World. *He toucheth the Stars with his finger and they run their course rejoicing.*"

"ఆ పరమేశ్వరుడు జగమ్మధ్యమున సామ్రాజ్యాసనాసీనుడై యున్నాడు. ఆయన ఉచ్ఛ్వాసము ప్రపంచమునకు ప్రాణమిచ్చుచున్నది. ఆయన నఖములు సోకి నక్షత్రములు ప్రజ్వలించుచున్నవి. ప్రచలించుచున్నవి."

"The shadow of knowledge passeth over the mind of man as a dream, *he seeth as in the dark, he reasoneth and is often deceived.*"

"స్వప్నమువలె జ్ఞానచ్ఛాయ మానవుని మనసు మీదనుండి దాటిపోవు చున్నది. దానిని మానవుడు చీకటిమాటున జూచుచున్నాడు. తర్కించి భ్రమయుచున్నాడు."

"Who is like unto the Lord in glory? Who in power shall contend with the Almighty? *Hath he any equal in Wisdom?* Can any in goodness be compared unto him?"

"కీర్తియందా ప్రభువునకు సీడెవ్వరు? శక్తియందా సర్వశక్తునకు సాటియేది? జ్ఞానమందా సర్వజ్ఞునకు సమానమెక్కడ? సౌశీల్యమం దాయనకు సరికలదా?"

దేశీయము, కవివమయ సిద్ధము, సుందరము, సంగ్రహము. ప్రౌఢము సహృదయ హృదయైకవేద్యము అయిన ప్రకాశకరుల అనువాదసాహితి కివే నా జోహారులు.

నైతిక ప్రమాణాలు దిగజారి, క్రమశిక్షణ యువకులలోను వయోజనుల లోను లోపించిన ఈ రోజులలో నీతినిధివంటి ఉత్తమ గ్రంథాలు దేశానికి ఎంతైనా అవసరం. ఈ అవసరాన్ని గ్రహించి విద్యాధికులు సామాన్య ప్రజలు తమ విధిని గుర్తించి, చదివీ, చదివించీ ఇట్టి గ్రంథాలను ప్రోత్స హించి దేశంలో నైతిక ప్రమాణాలను పునరుద్ధరించడానికి తోడ్పడుదురుగాక!

విజయవాడ
22-9-82

వేటూరి చంద్రశేఖరశాస్త్రి

# 'NEETI NIDHI'

## A unique exercise in translation

One outstanding work of Prabhakara Sastry is his translation of an English work 'Economy of Human Life' into Telugu. This translation by him was a unique exercise for more than one reason. The translator did not have proficiency in English. The fact that he came to know of the existence of such a work was itself surprising as only two copies of it were available - one in the Library of Theosophical Society, Adayar, Madras and another in the National Library, Calcutta. Thus the rarity of the original work is an unusual feature,

Prabhakara Sastry has mentioned in his foreword to his translation how he came to know of this work. Sastriji's friend and esteemed scholar, the late Manavalli Ramakrishna Kavi, who was himself a post-graduate, once told him of this work and suggested to him to translate it into Telugu. That a research scholar of the calibre of Ramakrishna Kavi should have thought that Prabhakara Sastry who did not know English could ably translate the English work into Telugu does credit to both of them.

The title of the Telugu translation is "Neeti Nidhi", The word "Neeti" here means aphorisms and the word 'Nidhi' means a treasure. Prabhakara Sastry has given the reason for not conforming to the title of the original work. He felt that a Telugu translation of the original title would be rather unsuitable. Moreover, our ancients had considered such works as belonging to 'Neeti Sastra'. (i. e. Science of Ethics). Since the work deals with moral

values, the translator felt that for the Telugu version the pithy title he had chosen would be unobjectionable.

Here one should know about the greatness of the original work, part of which Sastriji got read out to him and was astonished about its uniqueness before he decided upon its translation into Telugu.

A personal note has to be struck here inevitably. I came across a pocket size publication of this work, when my uncle Dr. Veturi Sankara Sastry and myself visited G. A. Natesan's book-stall in Esplanade probably in the early forties. I was a post-graduate student at that time. I drew my uncle's attention to this tiny book and suggested to him that the book might be purchased as I had no money with me. It was bought for one rupee and fourteen annas by him. For a long time it was in my uncle's library at Muktyala. Later on when I was in Delhi on service I wrote to my uncle and he kindly sent it on to me. I gave that book, no doubt, to a good friend and a bibliophile, one Kota Lakshminarayana, and the book was lost. Before it was lost in a letter to the Editor, Statesman, New Delhi, I wrote about this book. The letter was published on the 19th August 1963 under the caption "A Chinese Emissary to the Grand Lama – A Rare Book and its Mysteries". The Chinese aggression was on or was over at that time.

The pocket sized book was unpriced. It was published by Luzac & Co., 46, Great Russel Street, London in 1902. It was a translation by an Englishman who preferred to remain anonymous, from an Indian manuscript written "by an ancient Bramin". The translator had addressed two letters to Lord Chesterfield, his patron, forwarding the texts in two instalments to him on May 12, 1749 and January 10, 1750. The letters gave the following details about the origin of the manuscript and how he came by it.

The Chinese Emperor (reigning probably in 1749) was interested to know of the hidden treasures in the archives of the Grand Lama of Tibet and sent an eminent Chinese scholar Cao-tsou, well-versed in Tibetan language, with a letter of introduction and lavish presents, to the Grand Lama. Cao spent about six months in the Sacred College where he was lodged and with the assistance of learned Lamas took copious notes from notable works of antiquity.

*"The most ancient piece he hath discovered and which none of the Lamas for many ages had been able to interpret or understand, is a small system of morality written in the language and character of ancient Gymnosophists or Bramins; but by what particular person, or in what time, he does not determine".*

The Chinese translation of the work became popular and the learned men of that country attempted to attribute it either to Confucius or Lo kium, the founder of the Taossee sect, conveniently assuming that the original Chinese text might have been lost and probably its translation in Sanskrit was only extant On the basis of internal evidence, some others inferred that it might have been written by the Brahmin Dandamis "whose famous letter to Alexander the Great is recorded by the European writers". Cao seems to have aggreed with the latter hypothesis.

Regarding the person to whom the book was sent to communicate to the public and the person who translated it into English, it was said :

*"There are some reasons which at present make it proper to conceal, not only his own name, but the name of his correspondent, who has now resided in China several years, and been engaged in a business very different from that of collecting literary curiosities. These reasons will not subsist long; and as he seems to intimate a design, on*

*his return to England, of publishing an entire translation afCao-tou's whole journey, the public will then, in all probability, have an opportunity of being satisfied concerning any particular which they may be curious to know''.*

Evidently by 1902, when the Economy of Human Life was published by the Luzac & Co. the identity of the persons referred to was not known.

The preface to the book was written by a Douglas M. Gane of Richmond Hill. The preface mentioned that the book when first published had a ready sale in England and that by 1812 it ran into its fiftieth edition. Then it dropped out of notice. The book would seem to have been translated into French, German, Italian and Welsh. It was paraphrased in verse, illustrated in various styles and by distinguished artists. The publishers brought out a new edition in 1902 to revive interest in the book.

The book is in two parts. The first deals with the duties of man; passions like hope and fear, anger, pity etc. women; man in his capacity as husband, father, son and brother; accidental differences among men like rich and poor, master and servant etc; social obligations like justice, charity, gratitude, security etc., and religion. The second deals with the organic structure, physical sense and the soul of man; his infirmities like vanity, inconstancy etc., and their effects, the ignoble and noble qualities of human beings; and natural accidents which man is heir to like prosperity and adversity, pain and sickness and death.

On the basis of my letter, the Statesman got the position checked from the National Library, Calcutta. The Library has a 1798 edition. The Oeconomy of Human Life printed by T. Rickaby for E. Harding, Pall - Mall, London 1798. This edition is in seven parts. Part I duties that relate to man considered as an individual; part II of

the passions; part III women; part IV consanguinity, or natural relations; part V Providence or the accidental differences of men; part VI social duties: part VII religion.

A. Mawaz of Dacca interacted to my letter in the Statesman on August 20th 1963. He had mentioned that he had a book in his possession with a different title; "Unto Thee I Grant" (Unto thee I Grant the Economy of Life"). It is a private, revised, and limited edition in modern English, revised by Ramatherio, and issued by the Roscicrucian Order. It contains the unknown English Explorer's letter of May 12, 1749 and the Chinese Emperor's letter to the Grand Lama of Lahsa.

Mawaz mentioned that the preface says that the English man's letters were addressed to the Earl of Derby who (along with other interested English scholars) had commissioned the former to gather unknown historical and geographical data. It appears that a rare copy of the original translation in English (done in 1749 by the English explorer from Cao-Tsou's Chinese Version brought from Tibet to the court of the Emperor of China), issued in a limited edition by the Earl of Derby, is preserved in the archives of the Rosicrusians. As it was felt that the legibility of this copy could not be preserved for more than a few years, the issue of the present edition was specially authorised, as has been mentioned earlier.

Mawaz in his letter had further said that excavations in Egypt and Jerusalem within the last hundred years revealed that the original manuscript could not have been written by Confucius or anyone of his time or nation or beliefs. He has put in quotes that :

"There is every indication throughout the work most of it was written by Amenhotep IV, Pharaoh of Egypt, during the years 1360 to 1350 B. C. or thereafter, or by some of his successors in the great school of mysticism which he founded in Egypt."

క్రొత్తయెత్తుల నాతఁ డెత్తుచుండును. కళలు, విద్యలు నాతని ప్రాపున వెలయుచుండును.

తనయనుభవమునకు దాఁటియున్నసంపద నాతఁడు దరిద్రులసొమ్మని తలఁచును. అట్లే దాని వినియోగించును.

ఆతని యుపకారబుద్ధి నాతనియదృష్ట మడ్డగింపదు. కాన యాతఁడు తనభాగ్యముచేఁ బరితోషమునే పడయును. ఆతనియానంద మనిందితము.

సంపదను దనయింటిలో గంపలతో నింపుకొని దానిచేఁ దానే సుఖపడఁ జూచువాఁడు శోకముచేఁ జీకునుగాక.

బీదలు చెమటయోడ్చి చేసెడుసేవను గుర్తింపక వారి కడుపుగొట్టి గడింపఁ జూచువాఁడు దుఃఖముచేఁ గ్రుంగునుగాక !

లుబ్ధుఁడు జాతిగుండెవాఁడై యితరుల నడఁగఁద్రొక్కుచుఁ దాను వర్ధిల్లును. సహోదరునికష్టముల కాతఁడు జాలిగొనఁడు. అనదల కన్నీరు వానికిఁ బన్నీరు. వితంతువుల పరిదేవనము వానికి సంగీతకము.

డబ్బుపిచ్చిచే వానిహృదయము దిబ్బడగొని యుండును. కష్టముగాని దుఃఖముగాని వాని హృదయమును గరఁగింపఁజాలవు.

అయినను దురాశాదోషము వానిని బీడించుచునే యుండును. ఆసాపల కలవరములు, పలవరింతలు, నతఁ డితరులకుఁ గలిగించు నిక్కట్టు

లకుఁ దగినట్టు కసిదీర్చుకొనుచునే యుండును.

వాని హృదయ పరితాపముముందఱ నిప్పచ్చరపువాని చప్పరింత లోక లెక్కలోనివి గావు.

ఇది యెఱిఁగి బీదవాఁడు తనకుఁదాను శాంతి సంతోషములను సమ కూర్చుకొనఁదగును. అట్లనుటకుఁ గారణము లింకను గలవు.

బీదవాఁడు తనగంజిమెదుకులను ద్రాగుటకు శాంతముతోఁగూర్చుండును. ఆతనియాకుముందు ముఖస్తుతిపరులు, సర్వగ్రాహులు చుట్టియుండరు.

తన ప్రోపు నాసించి బాధపడువా రెవ్వరు నాతని కుండరు. కావున నాతఁడు కలవరము చెందఁడు. పలువుర పరిదేవనము లాతని చెవుల బాధింపవు.

భాగ్యవంతులు తిను పంచభక్ష్యపరమాన్నాదులు లేవు గాన వ్యాధులు గూడ నాతని బాధింపఁజాలవు.

ఆతని యాహార మాతనికి రుచ్యముగాదా! ఆతని శీతలోదక మాతనికి దప్పి దీర్చి తృప్తిగొల్పునదిగాదా ! ఆ శీతలోదకము ధనవంతులు త్రాగు పానీయములకంటెఁ బ్రశస్తమయినది.

వాని కాయకష్టము వాని యారోగ్యమును గాపాడుచున్నది.

హంసతూలికాతల్పములందు శయనించు సోమరు లెన్నఁడును గని యెఱుఁగనినిద్ర నాతఁడు సుఖముగా నిమిషములోఁ గనఁగలఁడు.

ఆశల నాతఁ డణఁగఁ ద్రొక్కును. తృప్తి, శాంతము, వాని హృదయ మునకు ధనము, ఘనత, కూర్పలేనిహాయి నొడఁగూర్చును.

భాగ్యవంతుఁడు తనభాగ్యమును జూచుకొని గర్వింప నక్కఱలేదు. దరిద్రుఁడు తనదారిద్ర్యమును దలఁచుకొని పలవింప నక్కఱలేదు. సహజముగనే దైవము వారికేదో సౌఖ్యము నిచ్చును.

౩. యజమానులు, సేవకులు

దాస్యమునుగూర్చి మానవుఁడా ! క్లేశపడకుము. అది దైవవిధి. దాని వలనఁ జాలలాభము లున్నవి. జీవితక్లేశములు చింతలు వీకది లేకుండఁ జేయును.

సేవకునకుఁ బ్రతిష్ఠగూర్చునది స్వామిభక్తి. విధేయతయు వినమ్ర తయు దానిసుగుణములు.

కావున నీవు యజమానుని యాజ్ఞల కణఁగియుండుము. ఆతఁడు నిన్ను దూషించినపుడు దురుసుగా బదులు చెప్పకుము. మాటాడకుంటివా దాని నాతఁడు మఱవఁజాలఁడు.

ఆయనకు లాభముగూర్చుపనులను భద్రముగఁ జూచుచుండుము. ఆయన నీయెడ నమ్మకము గలిగియుండెనని విశ్వసించియుండుము.

నీకాలము కష్టము నాయనవి. నీకాయన వానికై సౌమ్మునిచ్చు చున్నాఁడు. కావున వాని విషయమున నీ వాయనను మోసగింపకుము.

యజమానుఁడా : సేవకుఁడు నమ్మినవాఁడుగా నుండవలెనని కోరుదు వేని నీవు వానిని నమ్మి న్యాయముతో నుండుము. వాఁడు విధేయుఁ డుగ నుండవలె నని కోరుదువేని నీవు వానికి నుచితమైన యాజ్ఞల నొసఁగుము.

సేవకునియందుఁగూడ మానవశక్తులన్నియు నున్నవి. కాఠిన్యముచే భయము కలిగింపవచ్చునుగాని వాని ప్రేమను బడయరాదు.

నిందించునపుడు నిందతో దయను గలపుము. అధికారించునపు డధికా రముతో న్యాయమును గలపుము. అట్లుచేసితివేని నీయుపదేశములు వానికి హృద్యములగును.

కృతజ్ఞతవలన వాఁడు నీకు శ్రద్ధతో సేవచేయును. ప్రేమవలన వాఁడు నీకు సంతోషముతో విధేయతను జూపును. వానిశ్రద్ధకు, విధేయతకుఁ, దగిన బహుమానము నీవు తప్పక చూపవలెను.

౪. రా జు, ప్ర జ లు

నీతో సమానులయిన మనుజులే నీకు రాజాధికారమిచ్చిరి. వారే నిన్ను రాజుగ నెన్నుకొనిరి. అట్టివాఁడా : స్వర్గమునకు సమ్మతుఁడయినట్టి వాఁడా : ప్రజలు నీయెడ నమ్మకము పెట్టుటకుఁ గలభావములు నీకున్న మర్యాదకంటెను నౌన్నత్యముకంటెను, మున్నతమైనవని నమ్ముము.

రాజపట్టధారివై నీ వొక సింహాసనమునఁ గూర్చున్నావు. రాజతేజముఁ దెలుపు కిరీటము నీతలపై నెలకొనియున్నది. అధికారదండము నీహస్త

మందున్నది.ఇవియెల్ల నీకొఱకుఁ గాదు. నీప్రాభవముకొఱకుఁ గాదు. నీరాజ్యము యొక్క ప్రాభవముకొఱ కీయఁబడినవి.

రాజునకుఁ గీర్తి యేమనఁగాఁ దన ప్రజలసౌహార్దమే. ఆయన యధికారము, రాజ్యము, ప్రజల హృదయములమీఁద నున్నది.

మహనీయుఁడగు నృపునిమనస్సు ఆతని యున్నతస్థితికిఁ దగినంత యున్నతముగా నుండును. గొప్పవిషయములఁ నాతఁడు తలపోయుచుండును.

తన రాజ్యమందుండు విద్వాంసుల నాతఁడు చేరఁబిలుచును. చనవుతో వారితో సంభాషించును. వారి యభిప్రాయముల నాదరించును.

ఆతఁడు తనప్రజల మెలఁకువతోఁ జూచి వారిశక్తులఁ గనిపట్టి వారి యోగ్యతలకుఁ దగినట్టు పనిపెట్టును.

ఆతని న్యాయాధికారులు న్యాయముగలిగి యుందురు. మంత్రులు ప్రాజ్ఞులై యుందురు. ఆయనహృదయమునకుఁ బ్రియమగువాఁడాయనను మోసగింపఁడు.

విద్యలన్న నాతఁడు వేడుకపడును. వానిని వృద్ధిపఱచును. చదివినవారన్నను జ్ఞానవంతులన్నను నాతఁడు సంతోషించును. ఒకరి నొకరు మీఱవలె నన్నకోరిక నాయన వారికిఁ గలుగునట్లు చేయును. ఆయన పరిపాలన ప్రఖ్యాతి వారి పరిశ్రమవలనఁ బెంపొందుచుండును.

వాణిజ్యము పెంపొందించు సాహుకారులను, పైరుపంటలను జక్కఁగా సాగించు కర్షకులను, చిత్రసృష్టిని గావించు చిత్రకారులను, ప్రతిభా వ్యాపారమును జూపు పండితులను నాతఁడు దయతో నాదరించును. బహుళముగా బహూకరించును.

ప్రజలసుఖ నివాసముకొఱకై యాతఁడు గ్రామములఁ గట్టించును. వ్యాపారముకొఱకు గొప్పయోడలను, నవియుండుటకుఁ దగినరేవులను, కృషిసౌభాగ్యముకొఱకుఁ గాలువలను నాతఁడు కల్పించును. ఆయన ప్రజలు భాగ్యవంతు లగుదురు. దానిచే నాయనరాజ్యము ప్రబలమగును.

జ్ఞానముతోను న్యాయముతోను నాతఁడు శాసనముల జరుపును. అతని ప్రజలు తమశ్రమమునకుఁ దగినఫలమును సులభముగాఁ బడయుదురు. శాసనముల ప్రకారము నడచుకొనుటయందు వారికి సౌఖ్యమున్నది.

ఆయనతీర్పులందు ధర్మము, దయ, దయివాఱుచుండును. దుష్టులను శిక్షించుటయం దాతఁడు పక్షపాతము లేక పట్టుదల గలిగియుండును.

ఆతడు ప్రజలమొఱ లాలకించును. వారిని గష్టపెట్టువారిచేతుల నాతఁడు కట్టిపెట్టును. కాన యాతని ప్రజ లాతని భక్తితోను ప్రేమతోను జూతురు. తమ సౌఖ్యానుభవమున కాతఁడే సంరక్షకుఁ డని వారు విశ్వసింతురు. ప్రజలాతనియెడఁ జూపు ప్రేమ ప్రజలయెడ నాతని గాఢానురాగము గలిగించునదిగా నుండును. ప్రజాసౌఖ్యము కొఱ కాతడుఁ జాగ్రత్తగలిగియుండును.

ఆయనకు విరోధమును బ్రజ లెప్పుడును దలంపరు. విరోధుల కుతంత్రము లెప్పుడును నాతని కపకారము చేయఁజాలవు. కంచుగోడవలెఁ బ్రజలాతనిఁ గాపాడుచుందురు.

ప్రజారంజకుఁడుగాని రాజుసేనలు గాలికిఁగొట్టుకొనిపోవు పొట్టువలెఁ బనిపట్టినప్పుడు పాఱిపోవుదురు.

శాంతిసౌఖ్యములు సత్ప్రభుని ప్రజలం దుండును. కీర్తియు బలమును నాతనిసింహాసనముఁ జెందియుండును.



# నీతి నిధి

## షష్ఠాధ్యాయము

## సాంఘిక ధర్మములు

### ౧. ఉపకారబుద్ధి

ఈప్సితములను గూర్చి యెంచునపుడును, గొఱతలను గూర్చి చింతించునపుడును, నరుఁడా! నీకు బుద్ధినిచ్చి, భాషనేర్పి, మానవసంఘమునఁ బరస్పరము నిచ్చిపుచ్చుకొను సంబంధము గల్పించి, మంచుచున్న మహాత్ముని మంచితనమును మెచ్చుకొనుము.

ఆహారము, వస్త్రము, సుఖనివాసము, అపాయాపాకరణము, సంసార సంతోషము, ఇవియెల్ల నీ కితరులతోడ్పాటువల్లఁ గలుగును. అవి సంఘమునఁదప్ప మఱి యితరత్ర నీకు జతపడవు.

కాఁబట్టి నీకు మనుష్యు లందఱు మిత్రులుగా నుండుట మంచిది. కావున నీ వితరులతో మంచియు మైత్రియుఁ గలిగియుండుము.

గులాబిపూవు స్వాభావికముగనే సౌగంధ్యము గల్గియుండునట్లు సత్పురుషునిహృదయ మెప్పుడును సత్కార్యతత్పరముగా నుండును.

ఆతడు శాంతిని, సౌఖ్యమును దా ననుభవింపఁగలఁడు. పొరుగువారి యానందమును నభివృద్ధిని జూచి మెచ్చుకోఁగలఁడు.

దూషణములకాతఁడు చెవియొగ్గఁడు. పరుల తప్పిదములును దైన్యములును నాతనికి బాధగలిగించును.

మంచిచేయుట యాతనికి హితము. దానికై యాతఁడు కాలమును గారణమును వెదకుచుండును. ఇతరుని బాధను బాపుటచే నాతఁడు తన బాధను బాపికొనును.

తన మనసు పెద్దదగుటచే నాతఁడు తన కోరికలం దందఱసౌఖ్యమును జూచును.

౨. న్యా య ము.

సంఘశాంతి న్యాయముపై నాధారపడియున్నది. ఒక్కొక మనుష్యునికిని శాంతి, వానివాని వాంఛలఁబట్టియున్నది. కాఁబట్టి నీకోరికల మితి మీఱనీయకుము. పొరుగువాని వస్తువులఁ గోరకుము. వాని వస్తువుల నీవు తాఁకఁగూడనంత పవిత్రముగ్గ దర్శింపుము.

ఉద్రేకములకుఁ జొల్పడికాని, యొరుల మాయలఁ బడికాని యితరుని హింసింపను జెయి యెత్తకుము.

అన్యు నవమానింపకుము. చెడ్డసాక్ష్యము చెప్పకుము. వానిసేవకుఁడు వాని వంచించునట్లుగాని విడనాడునట్లుగాని చెప్పి చేయింపకుము. వానిప్రాణేశ్వరిని బాపకృత్యములందుఁ బడఁద్రోవకుము.

నిష్పక్షపాతమును, న్యాయ్యమును, నగు నడవడి గలిగి యుండుము.

నీబాధ్యతను జక్కఁగా గుర్తించియుండుము. నమ్మిన వానిని మోసగింపకుము. దైవముముందర దొంగతనము ద్రోహముకంటెఁ దక్కువచెడుగుగా నగు నని యెఱుఁగుము.

పేదలను బాధింపకుము. కూలివానికూలి నియ్యక వేధింపకుము.

లాభముకొఱకు దేనినేని యమ్మునపుడు నీయంతరాత్మ నడిగి నీలాభమున కొకమితి తెలిసికొని తృప్తిచెందుము. కొనువాఁడు తెలియనివాఁడైనచో నది సందుగాఁ జూచుకొని నీవు చాలలాభము పొందఁ జూడకుము.

ఈయవలసినయప్పుల నిచ్చివేయుము. ఏలన ఋణదాత నీమర్యాదను విశ్వసించెను. అట్టివానికి న్యాయ్యముగా నియ్యవలసినది యియ్యక పోవుట తప్పు. తుచ్ఛము.

తుద కిది వినుము. ఓసంఘసంబంధీ! నీహృదయమును బరీక్షించుకొనుము. మఱపును దొలఁగఁద్రోలుము. జ్ఞప్తిని జక్కఁబిలువుము. పయివిషయములందు బరాకుఁ జెందుదువేని నీ వవమానితుఁడ వగుదువు.

౩. త్యాగము

హృదయమున నౌదార్యబీజముల వెద వెట్టినవాఁడు సుఖమందును. ఆ బీజములు మొలకెత్తి త్యాగము ప్రేమయను ఫలములను బండును.

ఆతని హృదయ మనెడి యూటపట్టునుండి సౌజన్యప్రవాహ మెప్పుడును ప్రజాక్షేమమునకై పాఱుచుండును.

బీదలకుఁ గష్టకాలమున నాతఁడు సాహాయ్యము సల్పును. సర్వక్షేమమున కాతఁడు సంతసించును.

పొరుగువాని నాతఁడు నిందింపఁడు. ఈర్ష్యాద్వేషముల నొదవించు వినికిళ్ల నాతఁడు విశ్వసింపఁడు.

మనుష్యులు చేయుకీళ్ల నాతఁడు మన్నించును. వానిని దనమనస్సున నిలుపుకొనఁడు. ప్రత్యపకారచింతయుఁ బగయు నుండుటకు వాని హృదయమునఁ దావుండదు.

అపకారి కాతఁడు ప్రత్యపకారము చేయఁడు. విరోధిని జూచి యాతఁడు రోఁతగొనఁడు. వాని యకృత్యములకు మైత్రితో మంచి గలుపును.

పరుల యిక్కట్టులకు జాలిగొని యాతఁడు వానిఁ బాపఁబూనును. ఆతఁడు కోపిష్ఠులకోపమును దగ్గించును. వారి తగవులఁ దీర్చును. ఇరుగుపొరుగుల శాంతిని సౌజన్యమును వృద్ధిపఱచును. వాని పేరు ప్రఖ్యాతమై బహుమానముతో నుచ్చరింపఁబడుచుండును.

౪. కృ త జ్ఞ త

నది తొలుతఁ దనకు నీ రొసఁగిన సముద్రమునకే తన నీటిపెల్లును బంపునట్లు కృతజ్ఞునిచిత్త ముపకారికిఁ బ్రత్యుప కారముచేయుటకొఱకే ప్రయత్నముచేయుచుండును. ఉపకారి నాతఁడు ప్రేమతోను గౌరవముతోను జూచును.

ప్రత్యుపకారము చేయుటకు శక్యము కాదేని యుపకారమును జ్ఞాపక మందుంచుకొనును. మరణముదాఁక దాని మఱవకుండును.

ధర్మాత్మునిచేయి భూమిపయిఁ బూవులను బండ్లను బైరులను వెల యించు నీటిమబ్బువంటిది. కృతఘ్నుని హృదయము వర్షోదకము నెల్ల దిగమ్రింగి తనలోనే యడఁచుకొని నిష్ఫల మొనర్చు నిసుక యెడారివంటిది.

మేలును మఱవకుము. దానిని దాఁచిపెట్టకుము. గర్వితులవలన నుప కారము పొందకుము. స్వార్థపరాయణులతోను నత్యాశాపరులతోను సంబంధము గలిగించు కొనకుము.

౫. నిష్కాపట్యము

సత్యదేవత సౌందర్యమునకు వలచి యామెపై మనసు నిలిపిన మానవుఁడా! నీ వామెపై స్థిరబుద్ధి నుంచుము. ఆమెను విడనాడకుము. నిశ్చలమయిన సౌశీల్యగౌరవముచే నీ వలంకృతుఁడ వగుదువు.

కపటములేనివానిపలుకులు భావము నంటి యుండును. వానికి హృదయ మందున్నదే నాలుకమీఁదను నుండును. మోసమునకు వాని మాట లందుఁ జోటుండదు.

అనృతమున కాతఁడు లజ్జించును. నిజమునం దాతనికన్ను నిలిచి యుండును. మాయలమారితనమునకు నైచ్యమునకు నాతడు రోఁత పడును.

ఆతఁ డెప్పుడును గలవరము చెందఁడు. వాస్తవమాడుట కాతఁడు ధైర్యము గలిగియుండును. బొంకుటకు మాత్రము భయపడును.

ఆతఁడు నైచ్యమునకుఁ గాపట్యమునకు మిక్కిలి దూరమందున్నాఁడు. దూరదృష్టితోను జాగరూకతతోను నాతఁడు పెదవులఁ గదలించును. న్యాయమును బరిశీలించి వివేకముతో మాటాడును.

మైత్రితో మాటాడును. ఒద్దికతోఁ దప్పు దిద్దును. మాట యిచ్చెనేని మఱుమాటలేక దాని నెఱవేర్చును.

కాని కపటాత్ముని హృదయము చాటుచేయఁబడి యుండును. వానిపల్కులకు సత్యపువన్నె చమురఁబడి యుండును. వంచనమే వానిపని.

వాఁడు దుఃఖమున నవ్వును. సంతోషమున నేడ్చును. వానిమాటల కర్థముండదు.

ఎలుకవలె నాతఁడుచీకటిలోఁ జెర్లాడుచు సురక్షితుఁడనని భ్రమించుచుండును. కాని యాతఁడు తన కెఱుకలేకుండఁ దన తప్పులచేతనే వెలికిఁ దేఁబడుచుండును.

అంతఁ దనదోషకాలుష్యము మొగానఁ దగిలియుండును గాన నలుగురు గుర్తింపఁగాఁ దల గ్రోఁకికొనును.

జీవితకాలమంతయు నాతఁడు నిత్యనిర్బంధమునఁ గడపును. ఆతని నాల్కకును హృదయమునకును సంబంధముండదు.

సచ్చరిత్రుని నడవడి నాతఁ డభినయించును. మోసగింపు టెత్తులచే సుపొ్పంగుచుఁ దనలోఁ దాను గాఢాలింగన సౌఖ్యము ననుభవించు చుండును.

నేను క్షేమముగ నున్నానని నీవు తలఁచునపుడును, నీ క్రుళ్లు వెల్లడియై నీవు వెంగిలివై నప్పుడును, జ్ఞానవంతులు నిన్నుఁజూచి నవ్వుదురు.



# సత్రినిధి

## సప్తమాధ్యాయము

## మతము

కారణకారణము, సర్వస్రష్ట, సర్వశక్తుఁడు, ఆద్యంతరహితుఁడు, అగోచరుఁడు, భగవానుఁ డొక్కఁడే కలఁడు.

సూర్యుఁడు దైవప్రతిబింబముగా నున్నాఁడు. అతఁడు తన ప్రకాశముచే నీలోకమునకెల్ల వెలుఁగును గలిగించుచున్నాఁడు. ఆయన వేఁడిమి భూమిపైఁగల వస్తువులకెల్లఁ బ్రాణ మిచ్చును. సూర్యుఁడు భగవానుని పనివాఁడని యెఱిఁగి ప్రశంసింపుము. ఆరాధింపకుము.

సర్వోత్కృష్టుఁడును సర్వజ్ఞుఁడును సర్వోపకారియు నగు నాయేకేశ్వరునకే యారాధనము తగును.

ఆయనయే తనచేతితో నాకాశము నలంకరించినాఁడు. తన వ్రేళ్లతో నక్షత్రమార్గముల నాయనయే యేర్పఱిచినాఁడు.

లోక మెల్ల దద్దఱిల్లునట్లు భూమిని వడఁకించువాఁడును బిడుగులఁ బడమోఁది దుర్మార్గుల నడిఁకించువాఁడును నాయనయే. సముద్రమును బంధించినవాఁడు, గాలి నరికట్టినవాఁడును నాయనయే.

లోకము లెల్లఁ బుట్టించువాఁడును గిట్టించువాఁడును నాయనయే.

సర్వశక్తుఁడైన యాయీశ్వరుని భక్తితోఁ బ్రార్థింపుము. ఆయనకుఁ గోపము వచ్చునట్లు వర్తింపకుము. అట్లయిన నీ వడఁగారుదువు.

ఆయనకార్యము లన్నింటిమీఁద నాయన దూరదృష్టికలదు. అనంతమయిన విజ్ఞానముతో నాయన లోకమును బ్రచలింపఁజేయుచుఁ బరిపాలించుచున్నాఁడు.

మన భవిష్యద్రహస్యము లాయనదృష్టికి బట్టబయలుగా నుండును. ఆయన దూరదృష్టికిఁ దెలియక తటాలన జరుగున దేదియు నుండదు.

ఆయన యుద్బోధము లతిగూఢములు. ఆయన విజ్ఞాన మిట్టిదని నీవు వివేకింపఁజాలవు.

కావున నీశ్వర విజ్ఞానమునకు భయభక్తులు గలిగియుండుము. ఆయన యుపదేశములకు విధేయుఁడవై లొంగివర్తింపుము. భగవానుఁడు దయాళువు. ఆయనలోకములను దయతో సృజించియున్నాఁడు.

ఆకాశముఁ జూడుము. ఆయనప్రకాశము గానవచ్చును. భూమివంకఁ జూడుము. ఆయన దయ దయివాఱుచుండును. కొండలును వెలయేళ్లును నాయనను బ్రశంసించుచున్నవి. పొలములు నదులు అడవులు నాయన కీర్తిని గీర్తించుచున్నవి.

మనుష్యుఁడా! ఆయన నిన్ను మాత్ర మితర జీవరాసులనుండి వేఱు పఱిచి వానికంటె నధికదశయం దుంచినాఁడు.

నీ శ్రేష్ఠతను గాపాడుకొనుటకు నీకు నాలోచనము నిచ్చియున్నాఁడు. సంఘమునందుఁ బెంపొందుటకు నీకు భాషాజ్ఞానము నిచ్చియున్నాఁడు. నీమనసునకు ధ్యాన శక్తిని, వివేచనాశక్తిని, అనుకరింపరాని తన పవిత్రగుణములను బ్రేమించుశక్తిని, ఇచ్చియున్నాడు.

నీవు నెఱవేర్పవలసిన దైవవిధులు నీ స్థితిగతులకుఁ దగినట్లుండున ట్లాయన కల్పించినాఁడు. కావున నీవు వానిని నెఱవేర్చెదవేని సౌఖ్య మందఁగలవు.

ఆయన కారుణ్యమును గీర్తింపుము. నిశ్చలముగా ధ్యానింపుము. నీహృదయమునఁ గృతజ్ఞతను సంతృప్తిని దయివార్చుకొనుము. నీ కార్యములవలన నాయన యాజ్ఞలమీఁద నీకున్నభక్తిని వెల్లడించు కొనుము.

భగవంతుఁడు న్యాయముతోను సత్యముతోను లోకమును రక్షించు చున్నాఁడు. ఆయన యాజ్ఞల నుల్లంఘించిన వారిని శిక్షింపఁడా?

మనుజా! శిక్షించుటకు జాగైనందుచే దైవశక్తి తగ్గిన దనుకొనకుము. నీ యకృత్యముల నాయన యంగీకరించు ననుకొనకుము. ప్రతిహృద యము నాయనకన్నుదూరి చూడఁగలదు.

ఆదియెల్ల నాయన స్మృతియందుండును. మనుష్యులను గాని వారిపద వులను గాని యాయన మన్నింపఁడు.

ఈ జీవితము ముగిసినపిదప గొప్పవారు కొద్దివారు, భాగ్యవంతులు నిర్భాగ్యులు, జ్ఞానవంతులు జ్ఞానహీనులు, వారు వారొనర్చిన కార్యము లకుఁ దగినట్టు న్యాయ్యమైన ప్రతిఫలమును దైవనిర్దేశమువలనఁ బడయఁగలరు.

అత్తఱి దుర్మార్గులు తత్తఱిల్లుదురు. సన్మార్గులు సంతోషింతురు.

కావున నీవు నీ జీవితకాలమున భగవదాజ్ఞకు భయపడుచు నాయన నీ కేర్పఱిచిన సన్మార్గమున సంచరింపుము.

వివేకము నిన్ను వెలిపించునుగాక. నిబంధనము నిన్ను నియ మించునుగాక. న్యాయము నిన్ను సన్మార్గమున నడపునుగాక. దయ నిన్నుఁ గరఁగించునుగాక. భగవంతునిపైఁ గృతజ్ఞత నిన్ను భక్తి పరుఁగాఁ జేయును గాక!

ఇహమున నిన్నివి సుఖమునకుఁ దార్చి పరమున శాశ్వతానందమును బడయఁజేయును.

ఇదియే మానవజీవితవిధానము.

ప్రథమభాగము ముగిసెను.



# సిత్రి సిధ్ధి

## ద్వితీయ భాగము

### ప్రథమాధ్యాయము

## మానవ సామాన్యవిషయములు

### ౧. మానవ దేహము, దానినిర్మాణమును

అల్పబుద్ధివి, అల్పబలుఁడవు నగునరుఁడా! అడఁకువ గలిగి యుండుము. అనంతమయిన విజ్ఞానము నందఁగోరితివేని నీయెదుటఁ గానవచ్చు దివ్యశక్తులఁ దెలిసికొనఁ దలఁచితివేని ముందు నీ దేహమునుగూర్చి యాలోచించుకొనుము. వెఱపును వింతను గొల్పునట్లు నీవు సృష్టింపఁబడితివి. ఇట్టు సృష్టించిన సృష్టికర్తను నీవు భయభక్తులతోఁ బ్రస్తుతింపుము. ఆయనయెదురఁ గృతజ్ఞతను సంతోషమును దెలుపుకొనుము.

జంతుకోటిలో నెల్ల నిట్టనిలుచువాఁడవుగా నీ వేల సృష్టింపఁబడితివో యెఱిఁగితివా? భగవంతుని పనులఁజూచుటకుఁ జుమా! చూచు టెందు కందువా? అచ్చెరువు చెందుటకు; అది యెందు కందువా? అయన నారాధించుటకు.

ఎఱుక నీలోమాత్రమే యేర్పడనేల? అది నీ కెక్కడనుండి యొదవి

నది? ఆలోచనశక్తి మాంసమందు లేదు. వివేచనశక్తి యెముక లందు లేదు. పురుగులు తన్నుఁ జరిగొనుచనని సింహ మెఱుఁగదు. యజమానుఁడు తన్నుఁ జంపుటకు సాఁకుచున్నాఁడని మేఁక యెఱుఁగదు.

నీవు చూడఁగల్గినవానికంటె నింకేదో యొకటి నీలోఁ గలదు. నీ యింద్రియములకు గోచరముగాని దింకేదో నీలో నుండి నీభౌతిక శరీరమునకుఁ బ్రజ్ఞను గల్పించుచున్నది. అది యేదో యెఱుఁగుము.

అది నిన్ను వదలిన పిదప నీయొడలు పట్టిదిగా నట్టె యుండును. కాన యది నీమేనిలోని భాగము గాదు. అది భౌతికము కాదు గాన శాశ్వత మయినది. వ్యాపారించుటయందు దానికి స్వాతంత్ర్యమున్నది. కావున నది తన చేయు పనుల కన్నిటికిని దానే యుత్తరవాది యగుచున్నది.

గాడిద తనపండ్లతోఁ బచ్చికను గొఱుకఁగలదు. కాని దానికి నాహారపు టుపయోగ మవగత మగునా?

వెన్నెముక నీకున్నట్లు మొసలికిని వంకరలేకయేయున్నను నది నీవలె నిలువఁబడి యుండఁగలదా?

వానివలె నిన్నుఁగూడ నీశ్వరుఁడే సృష్టించెను. కాని వాని నన్నింటిని సృష్టించిన వెనుకఁ జుమా నిన్ను సృష్టించెను!

వానికంటె నుత్కృష్టతయు, వానిపై నధికారమును, నాయీశ్వరుఁడు

నీ కనుగ్రహించియున్నాఁడు. మఱియు స్వయముగా నెఱుఁగఁదగు నట్లు నీకు జ్ఞానసముచ్చయము నిచ్చియున్నాఁడు.

ఆ యీశ్వరుని సృష్టికంతకు శిరోభూషణమైన నిన్ను నీవ యెఱిఁగి కొనుము.

దైవత్వమునకును జడత్వమునకును నడుమ నుండి నీవా రెంటిని గెడ గూర్చువాఁడ వగుచున్నావు. దేవాంశము నీయందుఁ గొంతయుండుట తెలిసికొనుము. నీఘనతను నీవు జ్ఞప్తియం దుంచుకొనుము. నైచ్య మందును దౌష్ట్యమందును నడఁగిడ సాహసింపకుము.

పాపతోఁకను భయముగొల్పిన వా రెవ్వరో, గుఱ్ఱము గొంతుకను హేషితముల నెనయించిన వా రెవ్వరో, యెఱుఁగుదువా? పామును గాల రాచి పరిమార్పఁగల తెలివి నీకు వెలయించినవాఁడును, నీయుప యోగము కొఱకే గుఱ్ఱమును మాలిమి చేయఁగల కుశలతను నీకుఁ గూర్చినవాఁడును, అయిన యా యీశ్వరుఁడే.

## ౨. ఇంద్రియముల యుపయోగములు

ఆదిసృష్టి యని దేహమునుగూర్చి నీ వభిమానింపకుము. జీవస్థాన మని హృదయమునుగూర్చియు నీ వెక్కువగా ముదంపడకుము. ఇంటిగోడలకంటె నింటికంటె నింటి యజమానుఁ డెక్కువవాఁడు సుమా!

పెడపెట్టుటకుముందు సేద్యగాఁడు భూమిని బదనుపఱుచుకొనవలయును,

కంచుపోఁతకుముందు కంచరి కొలిమిని నెలకొలుపుకొన వలయును.

భగవంతుఁడు "మీతరఁగ లీవైపునకుఁ దరలవలయును. ఇంతకంటె నెత్తున కవి యెగిసిపడరాదు" అని సముద్రముల శాసించినట్లు నీయాత్మ నీశరీర వికారమును శాసించి, దారిఁజూపి, దాని పొగరును దిగఁద్రొక్కుసుగాక!

అవయవములకెల్ల నాత్మనియామకము. ఆయాత్మనిదేశములను నీయవయవము లనువర్తింపవలెను. ప్రభువుతోఁ బ్రజలు తిరుగఁబడఁ గూడదుగదా:

నీమేను భూమివంటిది. నీ యెముక లాయుర్విని మోచియుండు పర్వతముల వంటివి.

సముద్రపునీరే భూమినిబడి చెలమల నూరి యేళ్లఁబాఱి మరల సముద్రము చేరినట్లు ప్రాణము నీహృదయమునుండి వెలికిఁ బ్రవహించి మరల హృదయమునకే యేఁగుచున్నది.

పయిరెండును వానిగమనము నెప్పుడును సాగించుకొనుచునే యుండును గదా ! ఈరెంటిని సృష్టించినవాఁడు భగవానుఁడే.

నీముక్కు సుగంధగ్రహణమునకు ద్వారముగదా! నీనోరు రుచిగ్రహణమునకు ద్వారముగదా! అయినను సుగంధముల నెప్పుడును జూచుచుండిన వైరస్య మొదవును. రుచుల నెప్పుడును గొనుచునేయున్న నది కలిగించు నాఁకలి యాగిపోవును.

నీకన్నులు నీకుఁ గాపున్న కావలివాండ్రుగదా, అయినను నవి తప్పును నొప్పును గనుఁగొనుటలోఁ దఱచుగాఁ దప్పిపోవుచుండును.

నీయాత్మను నియమములందు నిలుపుకొనుము. నీ మనస్సును దాని మంచికొఱకుఁ గాచియుండుట నేర్పుము. అట్లుండిన నీమనస్సునకు మంత్రులగు నీకన్నులు నీకు సత్యమును నివేదించునవిగ నుండును.

ఈచేయి యొక చిత్రసృష్టికాదా? ప్రపంచమున దానివంటి దే దైనఁ గలదా? అది నీ కేల యీయఁబడినదో యెఱుఁగుదువా? నీ సహోదరులకు సహాయముచేయుటకు.

సృజింపఁబడిన జీవకోటులలో నెల్ల సిగ్గులు స్వభావము నీకే యేల యనుగ్రహింపఁబడినది? ప్రపంచము నీయవమానమును నీముఖమునఁ గనిపట్టును. కాన నీ వవమానకరములగు కార్యములఁ జేయఁగూడదు.

భయము, నివ్వెఱ, నీముఖవికాసమును భగ్నపఱచును. అపరాధము నీయందఁ జేరనీయకుము. అప్పుడు భయము నీ కఱఁగియుండును. నివ్వెఱ మగతనమునకుఁ దగినదిగాదు.

కలలయందు ఛాయాశరీరములు నీతో మాత్రమే యేల మాటాడును? వానిని మన్ననతోఁ జూడుము. ఏల యనఁగాఁ గలలు భగవత్ప్రసాదితములు.

మనుష్యుఁడా! నీవుమాత్రమే మాటాడఁగలవు. ఈశక్తికి నీవు వింత

పడవలెను. దీని నీ కనుగ్రహించిన మహనీయుని కర్తమైన యభినంద నముల నర్పింపుము. నీ బిడ్డలకు బుద్ధిగఱపి వారికి భక్తిమార్గము నెఱిఁగించు నామహనీయు నారాధింపుము.

౩. మనుజుని యాత్మ, దానియారంభము, దానిచేష్టితములు

మనుజా! నీ బాహ్యశరీరమునకుఁ బ్రసాదింపఁబడిన వరములుసుమా, ఆరోగ్యము, బలము, అవయవముల యానురూప్యము ననునవి: వీనిలో నారోగ్యము పేరెన్నఁ దగినది.

దేహమున కారోగ్యమెట్టిదో ఆత్మకు సౌశీల్య మట్టిది.

ఆత్మ యొకటి కలదనుట నీకుఁ దెలిసిన విషయములలో నెల్ల విస్పష్ట ముగాఁ దెలిపిన విషయము. కావున దానియెడ సాధుభావముగల్గి కృతజ్ఞుఁడవై యుండుము. పూర్తిగాఁ దానిని దెలిసికొనుటకై పోరా టములు పడకుము. దానినట్లు మానవబుద్ధి తెలిసికొనఁజాలదు.

ఆలోచించుట, అర్థముచేసికొనుట, వివేకించుట, సంకల్పించుట, ఆత్మయనుకొనకుము. అవియెల్ల దాని చేష్టితములు; కనుక నవి దాని ముఖ్యాంశములు కావు.

నీవు నిందితుఁడ వగుదువు. దాని నాకాశము నంటింపకుము. నీ వెగిరి పడువాఁడవు కారాదు. మఱియు దానిని బళువృత్తికిని దించి నీచ పఱుపకుము. అర్థజ్ఞానములేని గాడిదవలె గుఱ్ఱమువలె నీవగుట తగదు.

దానిశక్తులచే దాని వెదకుము. దాని సద్గుణములచే దాని గుర్తింపుము. అవి నీతలవెండ్రుకలకంటె నెక్కువగా నున్నవి. ఆకసముననుండు నక్షత్రములుగూడ లెక్కలో వీనికిఁ దక్కువే.

అరేబియా దేశీయులవలె నాత్మయొక్కటే మనుష్యులందఱియందును బంచి పెట్టఁబడియున్నదని యెంచకుము.

ఐజిప్టుదేశీయులవలె నొకమనుష్యునకే యనేకాత్మలున్నవనియు నెన్నకుము. నీకు హృదయ మెట్లొక్కటిగానున్నదో అట్లే యాత్మకూడ నొక్కటియేయని నమ్ముము.

సూర్యుఁడు బంకమట్టిని గట్టిపఱచును. మఱల నాతఁడే మైనమును గరఁగఁజేయును. ఈ రెంటి నొక్కఁడే యెట్లు చేయుచున్నాఁడో అట్లే యాత్మయు విరుద్ధకృత్యములను జరుపుచున్నది.

చీకటి తనచుట్టుఁ గ్రమ్మినను జంద్రుఁడు తన స్వప్రకాశమును సంరక్షించుకొనునట్లు బుద్ధిహీనుని హృదయమందుఁగూడ నాత్మ వినిర్మలముగనే వెలుఁగుచుండును.

ఆత్మకుఁ జావులేదు; మార్పులేదు. ఎల్లయెడల నదియేకమై యుండును. ఆరోగ్యము తనయందముఁ జూపుటకు దానిని బిలుచును జ్ఞానమనెడు తైలముతో దాని ముఖమును దత్పరత యభ్యంజనము చేయును.

అది నీవు పోయినపిమ్మటఁగూడ జీవించినను నీవు పుట్టుటకుఁ బూర్వము

కూడఁ గలదని యనుకొనకుము. నీ దేహముతో నదియు సృష్టింపఁ బడినది. నీ ప్రేగులతో నదియుఁ బెరిగినది.

న్యాయము, మంచిగుణములతో గొప్పఁజేసి దాని నీకీయలేదు. కరుణ, దానిని జెడుగులతో వికారపఱిచి నీ కీయలేదు. అవి యన్నియు నీవి. వానికన్నింటికి నీవు త్తరవాదివి.

చావు నిన్నుఁ బరీక్షింపఁబడకుండఁ గావఁగల దని యెంచకుము. దుర్వర్తన నిన్నుఁ బరీక్షనుండి తొలఁగించు నని తలఁపకుము.

నీకుఁ దెలియనిదాననుండి నిన్నుఁ గల్పించినవాఁడు మరల నీకుఁ దెలియనిదానిలోఁ నిన్ను గలపఁజాలఁడా?

కోడి నడిరేయిని దెలిసికొనుచుండలేదా? తెలిసికొని నీకు వేకువను దెలుపుటకు గొంతెత్తి కూయుచుండ లేదా? కుక్క తన యజమానుని యడుగులను దెలిసి కొనుచుండలేదా? గాయపడినమేఁక యాగాయమును మాన్పఁగల యోషధికడకుఁ బరుగిడుచుండలేదా? కాని యవి కడతేఱినప్పుడు వానియాత్మకూడ వానితో మట్టిలోఁ గలియును. నీయాత్మమాత్రమే నిలిచియుండును.

ఆజంతువుల కిచ్చియుండు గ్రహణశక్తులఁజూచి నీగ్రహణ శక్తులకన్నఁ గొన్ని మిన్నగాఁ జుఱుకుగా నున్నవని విన్నఁబోవకుము. అట్టిశక్తులు కలిగియుండుటలోఁ గాదు ఘనత; మఱి వాని నెఱిఁగియు నుపయోగించుకొనుటలో నున్నది. అది నీవు గ్రహింపుము.

నీకు దుప్పికిఁబోలె మారథ్వనివిను వీను లున్నను, గ్రద్దకుఁ బోలె సర్వమును దూరిచూచు కన్నులున్నను, జాగిలమునకుఁబోలె మూచూచి పసిపట్టఁగలిగిన ముక్కున్నను, కొండముచ్చునకుఁ బోలె మేలిరుచుల గుర్తింపఁగల నాలుకయున్నను, తాఁబేటికిఁబోలె సూక్ష్మస్పర్శజ్ఞానము గల తనువున్నను, వివేకించు తెలివిలేకుండెనేని వీనితో నీ కేమి ప్రయోజన ముండును ? అవియన్నియు నంతరించునవే.

వానిలో నేని కైన మాటాడ శక్తిగలదా? వానిలో నేదైన నీతో 'అందువలన నట్లుచేసితిని' అని చెప్పఁ గలదా ?

జ్ఞానవంతులపెదవులు, స్వర్ణభాండారపుఁ దలుపులవంటివి. అవి తెఱవఁ బడినతోడనే యనర్ఘవస్తువులు ముం దగ పడును.

వెండిపాదులలో బంగారుచెట్లమర్పఁబడినట్లు, జ్ఞానపూరితము లగు వాక్కులు ఉచితకాలములం దుచ్చరింపఁబడును.

నీయాత్మనుగూర్చి తగినంతగా నీవు తలఁచుకొనఁగలవా ? దానిని మితిమీఱునంతగా నీవు మెచ్చుకొనఁగలవా? అది నీకెవరిచే నీయఁ బడెనో వారి ప్రతిబింబము.

దానిఘనత నెప్పుడును జ్ఞప్తియం దుంచుకొనుము. ఎంత గొప్ప తెలివి నీకు సొంతము చేయఁబడినదో యెఱిఁగి యుండుము.

మంచినిజేయునదే చెఱుగునుగూడఁ జేయవచ్చును. కాన దానిని మంచి ప్రక్కకే యుంచుటకై జాగ్రత్తగాని యుండుము.

గుంపులో నున్నచో దానినిఁ గోల్పోవుదునని యనుకొనకుము. అరలో దాని నణఁచి యుంచఁగల్గుదునని తలఁపకుము పనిచేయుట దానికిఁ బరమానందము. పనినుండి దాని మానిపింపఁ గాదు.

దానిచలనము శాశ్వతము. దాని ప్రయత్నములు సర్వతోముఖములు. దానిచాకచకి యాఁక గొల్పరానిది. అంతరిక్షమున నున్నదానిఁగూడఁ దాని కన్ను కనుఁగొనఁ గలదు. విషయవిచారమున కది వేడుక పడును.

జలాపేక్షగలవాఁడు మండుచుండు నిసుకపట్టులందుఁగూడ నిసువక నీటికై వెదకులాడునట్టు జ్ఞానతృష్ణగొన్న యాత్మయు జ్ఞానమునకై గజిబిజి పడుచుండును.

ఏచియుండునది గాన దానిఁ గాచియుండుము. విచ్చలవిడిగాఁ బోవునది గాన దాని బిగ్గఁబట్టియుండుము. దౌర్జన్యము గలదిగాన దాని నార్జవ మందఁజేయుము. అది యుదకముకంటె నొదిగియుండునది; మైనము కంటె మార్పఁదగినది; గాలికంటె వీలుపడునది. దాని కానవెట్టున దేదియు లేదా ?

వివేకహీనునిలోనియాత్మ పిచ్చివాని చేతిలోని కత్తివంటిది. అది సత్యముకొఱకు వెదకులాడును. అసత్యమును గనుఁగొనుటకు దానికి సాధనములు తర్కము, అనుభవమును; కాని యివి బలహీనములు, నిలుకడ లేనివి; నమ్మకము చాలనివి; ఇఁక నది సత్యము నెట్టు లెఱుఁగఁ గల్గును ?

జనసామాన్యమునకు సమ్మతమైనంతమాత్రాన నేదిగాని సత్యమైనది కాఁజాలదు. ఏలన, జనసామాన్యము చాలఁగా మతిలేనిదై యుండును.

నీవు నిన్నుఁ దెలిసికొనుట, నిన్ను సృజించినవానిఁ దెలిసికొనుట, ఆయనను పూజింపవలసియున్నావనియుఁ దెలిసికొనుట — ఇవి యన్నియు నావశ్యకము లయినవని స్పష్టముగా నీకు గోచరించెనుగాదా? మనుష్యుఁ డింత కంటె నిశ్చయముగాఁ దెలిసికోఁదగినది మ ఱేమున్నది? చూడుము.

౪. మానవుని జీవితకాలము, దాని ప్రయోజనములు.

చక్రవాకమునకుఁ దెల్లవాఱుట యెట్టిదో గ్రుడ్లగూబకుఁ బ్రొద్దు గ్రుంకుట యెట్టిదో, తేనెటీఁగకుఁ దేనె యెట్టిదో మనుష్య హృదయమునకుఁ బ్రాణ మట్టిది.

ప్రకాశమానమైనను నది మిఱుమిట్లు గొల్పదు. అస్పష్టమైనను నది యసంతుష్టిని గొల్పదు. మధురమైనను నది వెక్కసము గాదు. కాని దానిసత్యమైన యుపయోగమును గుర్తించినవా రెవ్వరు?

జీవితము నెట్లు గౌరవింపవలెనో తెలిసికొని యట్లు గౌరవింపుము. అట్లుచేసితివా నీవు జ్ఞానశిఖరముదరి నుందువు. మతిమాలినవాండ్రు వోలె జీవితముకంటె నెక్కువ విలువ గల దిఁకనేదియుఁ లేదని తలంపకుము. పండితంమన్యులవోలె జీవితమును దృణీకరింపవలెనవికూడఁ

దలంపకుము. దానిని నీకొఱకుమాత్రమే ప్రేమింపకుము. ప్రధానముగా నితరులకుఁ జేయుహితముకొఱకు దానిఁ బ్రేమింపుము.

దాని నీవు బంగారమునకుఁ గొనఁజాలవు. మాణిక్యములకు నది లేని లక్షణముల నీవు కొనఁజాలవు. వచ్చుచున్న క్షణముల నన్నింటిని నీవు సౌశీల్యముతో సాగఁజేయుము. 'పుట్టకుండినఁజాల మేలయియుండెడి' దని తలంపకుము. పుట్టిన నేనిఁక శీఘ్రముగఁ జచ్చుట మేలని తల పోయకుము. సృష్టికర్తనుగూర్చి 'నేను లేకుండినఁ జెడుగనునది యుండునా' యని పనవకుము.

మంచి నీశక్తియం దున్నది. దాని నీ వార్జించుకొన లేకుండుటే చెడుగగును. నీవట్లు నిజముగాఁ బ్రశ్నింతువేని, అదిగో, ఆలోచించిచూడుః అది నీయవ్యక్తత నెఱిఁగించుచున్నది.

ఎఱను మ్రింగునపు డందు గాలము గలదని తెలిసియున్నచోఁ జేప దానిఁ జేరఁబోవునా ? వల తనయెదుట నుండు టెఱిఁగిన సింహ మందుఁ జిక్కునా ? పాంచభౌతిక మగు దేహముతో నాత్మకూడఁ బంచత్వము గాంచునేని మానవుఁడు మనఁగోరఁడు. కరుణానిధియగు నీశ్వరుఁడు మనుష్యుని సృజించికూడ నుండఁడు. కావున నీవు పిమ్మటఁ గూడ బ్రతుకుదువని తెలిసి కొనుము.

తాను జూచుటకుఁ బూర్వమే పంజరమున బంధింపఁ బడినపక్షి పంజరపుఁ గంతలందుఁ దనమేని మాంసభాగమును జొప్పించి తప్పించుకొనఁ గొట్టికొనుట యెంత వృధాయాసమో, నీవును నీ వుండుస్థితి

నుండి తప్పించు కొనఁజూచు టంతవృథాయాసమే యగును. నీకాస్థితి విధికృతమని యెఱుఁగుము. దానితోఁ దని వందుము.

దానిమార్గము లోకవేళ వికృతము అయినను బాధకములు గావు. అన్నిటిని నీవు తిన్నఁగా దిద్దుకొనుము. అణుమాత్ర మైనను జెడు గొప్ప దగపడెనో అప్పుడే గొప్పయపాయము రా నున్న దని యనుమానింపుము. గడ్డియే పడుక యయినచో నీవు కడు సుఖముగ నిద్రింతువు. గొజ్జఁగిపూవుల సెజ్జ యయ్యేనేని కంటకము లున్నవి. కడు జాగ్రత్తతో నుండవలెను జుమా!

మంచిచావు చెడ్డబ్రతుకుకంటె మేలు; కాన యెంత గాలము నీవు జీవింపవలెనో యంతగాలము బ్రదుకఁ బ్రయత్నించుము. కాని యెన్నాళ్లు బ్రదుకఁగలనని నీ వెన్నుకొనెదవో యన్నాళ్లను బ్రదుకవలయునని యాయాసపడకుము.

చావక నీవు జీవించియుండుట యితరుల కెక్కువ ప్రయోజనకర మైనచోఁ బ్రాణములను బరిరక్షించుకొనుట నీకుఁ బ్రధాన కర్తవ్యము.

బుద్ధిహీనులతోపాటు నాకు జీవితకాలము చాలదని గోలు పెట్టకుము: నీ కాకాలముతోపాటు కష్టములు గూడఁ దగ్గియే యున్నవని తలఁచి చూచుకొనుము.

నీజీవితకాలముననుండి పనికిమాలినపట్టులను దీసి వేసి చూడుము. ఏమి మిగిలియున్నదో యెన్నుము. శైశవమును దీసివేయుము. రెండవ

శైశవ మనఁదగిన వార్ధకమును దీసివేయుము. నిద్ర వేళలను దీసివేయుము. ఆలోచనము లేకుండఁ గడపు తడవులను దీసివేయుము. వ్యాధులతో నుండునవస్థలఁ దీసివేయుము. పూర్ణాయుష్య వంతుఁడవే యగుదువనుకొనుము. అయినను నీవు నిజముగ నిఁక నక్కఱకువచ్చు ఋతువుల నెన్నింటి నెక్కింపఁ గలవు ?

నీకుఁ బ్రాణమును వరముగ దానముచేసినదాత దాని నింకను నెక్కువ వరముగఁ జేయుటకై జీవితకాలమును దక్కువ చేసియున్నాఁడు. ఎక్కువకాలము జీవించియుండ వలయునని కోరెదవేని అది దేనికి ? ఎక్కువ దుష్కార్యములఁ జేయుటకా ? నీ యాయుః ప్రమాణమును దగ్గించినవాఁడు నీ వాకొలఁదికాలమునఁ జేయు సత్కార్యముల ఫలమునుజూచి సంతృప్తిని జెందఁడా ?

దుఃఖమయుఁడా ? ఏ కోర్కితో నోయి, నీవు నీయాయుః పరిమాణమును మించి యధికకాలము జీవింపఁ గోరునది ? ఊపిరి విడుచుటకా ? సాపాటు చేయుటకా ? లేక ప్రపంచమును బరికించుటకా ? ఇవి యన్నియు నీవు పలుమాఱు చేసినవే కావా ? ఆడినయాటయె యాడుట, పాడినపాటయె పాడుట విసుగును గొల్పదా ? చేసిన దానినే మరలఁ జేయుచుండుట రోఁతగాదా ?

సౌశీల్యమందు జ్ఞానమందు నభివృద్ధి నందఁగోరుదువా ? అయ్యో ! నీ వేమి యందఁగలవు ? అందించువా రెవరు ? నీ కున్నకొంచెమును గూడఁ గొఱకురాకుండఁ జేసికొనుచుందువు. కాన భగవవంతుఁ డింకను

గొప్పగా జీవిత మీయలే దని గునియకుము.

జ్ఞానలోపమునకుఁ బరితపింపవలదు. అది నీతో శ్మశానమునఁ జల్ల నాఱవలసినదే. ఇహమున సద్వర్తనము గల్గియుండుము. పరమున జ్ఞానాధిక్యమును బడయఁగల్గుదువు.

కాకిని జూచి "నాకంటె నేడురెట్లెక్కువకాలము నీ వేల జీవింప వలయు ?" ననియుఁ లేడినిజూచి "బహుపురుషాంతరములదాఁక నీ వేల బ్రదుకవలయు?" ననియు నడుగకుము. జీవితమును దుర్వినియోగ పఱుచుటలో నీతో వీనికిఁ బోలికి గలదా ? అవి నీవలె దుండగములఁ జేయునా ? క్రూరతగలవా ? కృతఘ్నములా ? ఇటు వినుము. అపరాధములేనిజీవిక, కాపట్యములేనినడవడి, చిరజీవితమునకుఁ దెరువు లని పయివానియొద్దనుండి నేర్చుకొనుము.

పయి జంతువులకంటె బాగుగా జీవితమును గడపఁగలవా ? అట్లేని యల్పజీవితమే చాలును.

తననికంటకత్వము నిమిషమైనను నెగ్గదని యెఱిఁగియుండియు లోకము నెల్ల లోఁకువగాఁ జేసికొని మఱచి పట్టుదేకించుచుండు మానవుఁడు చావే లేనియెడల నిఁక నేమిచేయ సాహసింపఁడు ?

నీకుఁ గావలసినంత జీవితకాల మున్నది. కాని నీవు దాని గణింపవు. మానవుఁడా ! నీకు జీవితకాలము తక్కువగా లేదు. నీవు దాని విచ్చలవిడిగా వెచ్చపెట్టుదువు. నీకావశ్యకమయినదానికంటె నధికముగా

నున్న ట్టాకాలమును దూరాలోచనలేక పారఁబోసికొందువు చివర కది యెల్ల నేకరమై నాకు రాలేదని శోకింతువు.

భాగ్యవంతునిఁ జేయునది సక్రమమైన, మితమైన వ్యయముగాని, సంపదతిశయముగాదు.

జ్ఞానవంతుఁడు చిన్ననాఁడె జీవితవిశేషమున కుపక్రమించును. అజ్ఞానుఁ డెప్పుడు నారంభించుచునే యుండును.

అంతమున భాగ్య మనుభవింతు ననుకొని ప్రారంభముననే ధనము కొఱకు బాధపడకుము. ప్రస్తుతము ననుభవింపనివాఁడు తనకుఁ గల దాని నెల్లఁ దొలఁగఁద్రోసికొనువాఁ డగును. సైనికునకు దానిరాక దెలియరాకమునుపే తూఁపుహృదమున దూరిపోవునట్లు జనునకుఁ దన బ్రదుకు తెలియరాకమునుపే మృత్యువు వచ్చి ముట్టికొనును.

మనుష్యుఁ డింకను జీవితము నేమని కోరవలెను ? ఊపిరి పీల్చు టేమని కోరవలెను ?

అది తప్పిదములస్థానము గాదా! దురుద్రేకముల పరంపర గాదా! అన్ని ప్రక్కలను అంకెలుగొనియున్న చెడుగుల గుంపును వెంబడించుట కాదా! అది యారంభమున నజ్ఞానాత్మకము. నడుమను గష్టఘటితము. తుదను దుఃఖమయము.

ఒకయల మఱియొక యలను ద్రోసికొనుచు వచ్చి యందుఁ జేరునట్లు మానవజీవితమున నొకచెడుగు మఱియొక చెడుగును వెన్నడించి యెక్కువగుచుండును. మహత్తైన వర్తమానము కించిత్తైన గతమును మ్రింగివేయును. మనదిగుళ్లు తఱచుగా వాస్తవము లయిన చెడుగు లగును. మనయాసాసలు దఱచుగా నసంభావ్యము లగును.

నశ్వరు లట్లు ఏనిమిష మేమో యని దిగులంది నొగులుచు, శాశ్వతు లట్లు ఆసాసలఁబడి గాసిచెందుచు బుద్ధిహీను లుందురు.

జీవితమందు మనతో నేభాగ మెక్కువగా నుండఁగోరఁ దగును ? బాల్యమా ? యౌవనమా ? యౌవనమునుగోరి దుడుకుఁదనమును, జెడునడతను, దుస్సాహసమును బ్రేమింతమా ? లేక ముదుసలితనమా యధికముగాఁ గోరఁదగినది ? ముదుసలితనమును గోరి వ్యాధులఁ బ్రేమింతువా ?

నరసినవెంట్రుకలు మరియాదఁ దెచ్చునని, వార్ధకము గౌరవము నిచ్చునని, కొందఱందురు. అటుకాదు సౌశీల్యమే వయస్సంపదకు వన్నెఁదెచ్చును. అదిలేనివయస్సు ముఖమున కధికముగా నాత్మమీఁదఁ గూడ ముడుతలను దెచ్చును.

దుండగముల నేవగించునని ముదుసలితన మాదరింపఁ బడుచున్నదా?

దుష్కృత్యములను, భోగవాంఛలను వయ స్సేవగించుట కాక దుష్కృత్యములు భోగవాంఛయు వయస్సునే యేవగించుట యగునప్పుడీ యూహ యెట్లుయుక్తమగును ?

యౌవనమున సౌశీల్యము గలిగియుండుము. వార్ధకమున గౌరవింపఁబడుదువు.



# సిత్రిసిద్ధి

## ద్వితీయాధ్యాయము

# మనుష్యుని మనోవికారములు వానిదోషములు

### ౧. గర్వము

మానవునిహృదయమునఁ జాంచల్యము చాల హెచ్చుగా నున్నది. ఉచ్ఛృంఖలత దానిని దనవేడుకచొప్పున నాడించును. నిరాశ దానిని సుదూరము గొంపోవును. భయము "సర్వస్వతంత్రమై యిక్కడ బలసియున్నా" నని యనును. కాని గర్వ మీయన్నింటికంటె ఘనమై యుండును.

మనుష్యస్థితికిఁ గలుగు కష్టములఁ జూచి దుఃఖింపకుము. అంత కంటె, దానితప్పిదములఁ జూచి నవ్వుటమంచిది. గర్వోద్రిక్తునిచేతులలో జీవిత మనునది స్వప్నచ్ఛాయవలె సాగిపోవును.

మానవులలో నెంతెని మన్ననగన్నవాఁడు గానిమ్ము, వీరుఁడు గానిమ్ము, ఎవ్వఁడయినను వాఁ డీగర్వపుబుద్బుదము గాక మఱెవ్వఁడు ?

జనసామాన్యము చంచలప్రకృతిగలది; కృతజ్ఞతలేనిది, జ్ఞానవంతుఁ డజ్ఞానులకొఱకేల హానినందవలెను ?

ఇప్పటిపనులయెడ జాగ్రత్తమాని గొప్పదన మందినప్పుడు చేయవలసిన పనులచొప్పును గూర్చి యోజించువాఁడు ఇతరులకుఁ దనయాహారము నిచ్చియుచ్చముడిఁగి యింట నుండు వానివంటివాఁ డగును.

ఇప్పటిదశలో నీకుఁ దగినచొప్పున నడచుకొనుము. గొప్పదశవచ్చి నప్పుడు మెప్పుఁబడయఁ గల్గుదువు.

గర్వమునుమించి కన్నుగప్పునదియు, డెందమును బొందలోఁ బడఁ ద్రోయునదియు వేఱొకటి లేదు. నీవు విన్నుఁజూచుకొనకున్నపు డితరులు నిన్నుఁ బూర్తిగా గుర్తింతురు.

తావిలేని పూవులబూకరింపుతోఁ గొఱమాలినగొప్పఁ దనమున బూరుగు చెట్టున్నట్టు, యోగ్యతలేనిభాగ్యముతోఁ బేర్మిలేని పెద్దఱికమునఁ గొంద ఱుందురు.

గర్వితునిహృదయము తృప్తినొందినట్లు కనుపడుచున్నను బాధ నొందును. సంతోషముకంటె వానికి సంకటమే యెక్కువ.

వానిగజిబిజిపాటు వానిచితితోఁ జల్లారదు. తనయునికిని మించి యాతఁ డూహలఁ బాటించును. తనయనంతరము తన్నితరులుపొగడుటకుఁ దానప్పు డితరులఁ బొగడును. కాని తొలుత వాని కాసగొల్పినవాఁడు తుదకు మోసము చేయును.

తాను చనిపోయినపిమ్మటఁ దన్నుగూర్చి లోకులుచేయు పొగడ్తను వినఁ గుతూహలపడువాఁడు. తనయాత్మకుఁ గలవరము కలుగకుండుటకై

తనయనంతరము స్వచ్ఛమైన వైధవ్యధర్మమునే సాగింపుమని భార్యను బలవంతపఱుచువానివంటివాఁడు.

బ్రదికినంతకాలము నీవు ధర్మపథమును దప్పకుము. దానింగూర్చి యితరు లేమనుకొన్నను నీవు లక్ష్యపెట్టకుము. ప్రశంసాపాత్రము కాఁదగినప్రవర్తనతో నీవు పరితృప్తిఁ జెందుము. నీవెనుకవచ్చువా రాప్రశంసను విని పరితోషింతురు.

తాను సంతోషభరితుఁడుగ సాక్షాత్కరించి వారిని వీరిని దనస్థితినారయఁ గోరువాఁ డెట్టివాఁడనఁగా, తనరంగు దానెఱుంగని సీతాకోకచిలుక వంటివాఁడు. తనమంచి వాసనఁ దానెఱుంగని మల్లెపూవువంటివాఁడు.

అట్టివాఁడు కన్నెత్తి యెవ్వరును గనుఁగొనరేని, ప్రపంచమున కంత కును బ్రవ్యక్తము గావేని నాస్వర్ణవస్త్రాభరణము లెందుకు? భాగ్య భరితములయిన నాభాండాగారము లెందు కనుకొనుచు! ఇస్సీ! ఇదిపరి కాదు. నీవు నీభాగ్యమును బడుగువాండ్ర కిడుము నీయాహారము నాఁకలిగొన్నవాండ్ర కర్పింపుము. అట్లుచేసితివా నీవు వౌగత్తను బొందుదువు. దానికి నేను దగిన వాఁడననికూడఁ దెలిసికొందువు.

చెల్లఁదగని మాటలతో నెల్లవారిని ముఖస్తుతిచేయఁ బూనెదవేల? ఎదిరి వాఁడు నిన్నెట్లే మరలఁ బ్రశంసించిన యెడల నేవపుట్టుట నీ వెఱుఁ గుదువు. అనృత మాడుచున్నాఁడ నని యెఱింగియు వాఁడు నీ సంతో షమునకై యట్లు సాగించును. మనఃపూర్వకముగ నీవు మాటాడుము. అట్లేని నీవు హితోపదేశముల నందుకొందువు.

అవలిప్తుఁ డగువాఁ డాత్మస్తుతియం దానందము గలిగి యుండును. కాని యితరులు తన్నుఁ గూర్చి తాఁ జేసికొను ప్రశంసల విననొల్ల రని యెఱుఁగఁడు.

ప్రశంస్య మయినది తానేదైనఁ జేసియుండిన, శ్లాఘ్యమైనది తానేదైనఁ గలిగియుండిన, నాతఁడు దాని వెల్లడించుకొనుటకు వేడుక పడుచుండును. దానిఁ దానితరులు ప్రశంసించుచుండ విని గర్వించుచుండును. అట్టి వానికోరిక తన్నుఁ దానే యోడించుకొనును.

అదిగో వాఁ డాపనిఁ జేసినాఁడు ! అదిగో వాని కాయాధిక్య మున్నది. అని యన్యులెవరు ననరు. కాని చూడు; వాఁడు దానిఁ గూర్చి యెంత గర్వియైయున్నాఁడో అని మాత్ర మనుకొందురు.

మానవునిహృదయము ఏకకాలమం దనేకవిషయములపై కేఁగఁజాలదు. దాంభికవిషయములం దెవఁడు తనయాత్మను నిలుపుకొనునో వాఁడు తాత్త్వికవిషయములను దలఁగఁద్రోసికొనును. దప్పిదీర్చు నూటబుగ్గలను దాఁటి యాతఁ డెండమావులకై యేఁగుచుండును.

౨. చాంచల్యము

మనుజుఁడా ! ప్రకృతి నిన్నుఁ జంచలత్వమునఁ బడఁద్రోచుచున్నది. కాఁబట్టి నీ వట్టుపడిపోకుండ నిలువరించుకొనుచుండుము.

జనని గర్భముననుండియే నీకుఁ జపలత కల్గినది. జనకుని హృదయ

మున నుండియే నీకుఁ జాంచల్య మలవడినది. ఇఁక నెట్లు నీవు నిశ్చలుఁడవుగా నిలువఁగల్గుదువు ?

నీకుఁ దనువునిచ్చినవారే దౌర్బల్యముఁ గూడ నిచ్చిరి. కాని నీకాత్మ నిచ్చినవాఁడు నిశ్చలసంకల్పమను నస్త్రమును గూడ నిచ్చినాఁడు. కాన దాని నీవుపయోగించుకొనుము. జ్ఞానవంతుఁడ వగుదువు. జ్ఞానివై తివా సౌఖ్యమందగలవు.

సమర్థుఁడు తన సామర్థ్యమును ప్రకటించు కొనుటలో జాగ్రత్త గలిగియుండవలెను. ఏలయన, నా సామర్థ్య మెల్లప్పుడు స్వప్రయత్నముచే సమకూఱునది గాదు.

సాధారణముగా నా సామర్థ్యమునకుఁ బ్రేరక మేదో వెలుపటనుండి వెలయుచుండునుగాదా! మఱియు నది యనిశ్చితములనుండి జనించును గాదా! హఠాత్సంభవములనుండి యావిర్భవించుచుండును గాదా! ఇంక నితరముల నాశ్రయించి యేర్పడుచుండును గాదా? కావున సామర్థ్య శ్లాఘదైవికములగు పైవానికిఁ జెందఁదగినది.

కార్యములకు నీవు కడంగునప్పు డనిశ్చయమును నీయండ నుండనీయకుము. వానిని నిర్వహించుటలో నిశ్చలతమ బూనుము. అప్పుడు స్వభావములోని సంకటములు రెంతు నీచే జయింపఁబడిన వగును.

పరస్పరవిరుద్ధము లయినపనులఁ బ్రవర్తించుటకంటె మనస్సునకు దూషిత మేమున్నది? దృఢమగు బుద్ధికంటె నీదోషము నణఁచునదేది ?

చంచలుఁడు తనమాఱుపాట్లను గమనించును గాని దాని కారణమును గనుఁగొనఁజాలఁడు. తననుండి తాను దలఁగిపోవుటను దెలిసికొనును గాని దానికారణమును గనుఁగొనఁజాలఁడు. న్యాయ్యములైన కార్యము లందు నీవు నైశ్చల్యము గలిగియుండుము. అప్పుడు జనులు నిన్నుఁ దప్పక నమ్ముదురు.

నీలో నీవు కర్తవ్యములఁ గూర్చి ధర్మనిర్ణయము కావించుకొనుము. నిర్ణయించుకొన్న ప్రకార మాకార్యముల నెఱవేర్పఁ బూనుము. సముచితములయిన వని నీవు ముందుగా సంకల్పించుకొన్న కార్యములయెడ నించుకైనను జాంచల్యముఁ బూనకుము.

అట్లు చేసితివేని నీయింద్రియములు నీకు లోపడియుండును. స్థిరచిత్తత నీలోని మంచిని స్థిరపఱుచును. అది దురదృష్టమును నీయింటనుండి గెంటివైచును. కలవరము, కార్యభంగము నీగృహద్వారముఁ జేరవు.

అన్యునియెడ దోషమును నీ వనుమానింపకుము; చూచి నిశ్చయింపుము. నిశ్చయించిన దాని మరల మఱవకుము. శత్రుఁడయి యున్నవాఁడు మిత్రుఁడుగా మాఱుట యసాధారణము. ఏలన, తనతప్పిదము నొప్పి కొని త్రిప్పుకొనువాఁ డెక్కడనో ఒక్కఁడుండును.

జీవితవిధానమునఁ గొన్నిసిద్ధాంతముల నేర్పఱుచుకొనని వాని కార్యములు చక్కఁగా గట్టెక్కుట యెట్లు? సహేతుకము కాని దేదియు సముచితముగ నుండదు.

చంచలుని యాత్మకు శాంతిలేదు. వానితోఁ గూడియుండు వాఁడుగూడ సుఖి కాఁబోఁడు.

వాని బ్రతుకుఁదెరు వొడుదుడుకై యుండును. వాని సంకల్పములు కొంకిరి బింకిరిగా నుండును. వాని హృదయము గాలివోలె నిటునటు మాఱుచుండును.

నిన్న వాఁడు నేఁడు ప్రేమించును; రేపు ద్వేషించును. అదేమో? నేఁ డేల ప్రేమించెనో రే పేల ద్వేషించునో వాఁడే యెఱుఁగఁడు. నేఁడు నీమీఁద నిరంకుశాధికారము నెఱపును. రేపు నీకు దాసాను దాసుఁడుగ నుండును. అదియేమో? నిర్వాహశక్తి లేకున్నను గర్వమున నుండు వాఁడు తనకు లోపడనివానికి దాసుఁ డగుచుండును,

నేఁడు, సమృద్ధితో నుండును. రేపు కడుపునిండఁ దినుటకే కష్టపడును. మితిదప్పి వర్తించువానిగతి యిట్టిదియే కదా!

పైక్షణమున రంగుమాఱి పచ్చికరంగు రానుండఁగా, నూసరవిల్లి నల్లని దని యెవ రనఁగలరు?

ఉత్తరక్షణమున నునికిమాఱి దుఃఖమంద నుండఁగా జపలుఁ డిప్పుడు సంతోషియని యెవ రనఁగలరు?

అట్టివాని జీవితము స్వప్నచ్ఛాయవంటిదే కదా! వాఁడు ప్రొద్దుట సుఖముగా నిద్దుర లేచును. మధ్యాహ్నమున బాధతో మఱుగును. ఈ గడి

యలో నాతఁ డొక దైవము. మఱుగడియలోఁ బురుగుకంటెను దక్కువవాఁడు. వాఁడొకక్షణము నవ్వును; మఱుక్షణమే యేడ్చును. ఇపుడు ప్రీతిచెందును. ఇంచుక సేపటికే రోఁతచెందును. మఱి కొంత సేపటికిఁ బ్రీతియగునో రోఁతయగునో యెఱుఁగఁడు.

సౌఖ్యముగాని దుఃఖముగాని వాని యందు స్థానము గలిగి యుండదు. ఉత్కృష్టతకుఁగాని నికృష్టతకుఁగాని వానియం దర్హతలేదు. నవ్వునకుఁ గాని, దుఃఖమునకుఁగాని వానికడఁ గారణము లేదు. కాన యవి యేవియు నాతని యెడ నిలుకడ గలిగియుండవు.

చపలమనస్కులసౌఖ్య మిసుకనేల పై మట్టము మీఁదఁ గట్టిన సౌధము వంటిది. గట్టిగా గాలివీచినచో దాని పునాదులు కొట్టుకొనిపోవును. ఇఁక నది యిడిసిపోవు ననుటలో నేమివింత !

తెకతెంపులేక తిన్ననై యున్న యాదారిలో నెదురై యేతెంచు గొప్ప యాకార మదియేమి ? తలతో నాకసమును బాదములతో భూమిని బట్టియున్న యారూపమెవ్వనిది ?

ఆతని కనుబొమలమీఁద రాజప్రాభవ మున్నది. ఆతని కీవియందు నైశ్చల్య మున్నది. ఆతని హృదయమున శాంత మున్నది.

దారిలో నాటంకము లున్నను నాతఁడు వానివంకనైనఁ జూడఁడు. భూమ్యాకాశము లేకమై యాతని నడ్డగించినను నాతఁడు నడచును.

కొండలుగూడ నాతని త్రొక్కిడికిఁ గ్రుంగిపోవును. కదలి నీరుగూడ నాతని యడుగులక్రింద నాఱిపోవును.

పెద్దపులి యాతనిమార్గమునడ్డగించినను నది వ్యర్థమగును. చిఱుత పులిమచ్చలు వానిని వెఱిపింపఁజాలవు.

ఆయుధపాణు లయిన సైనికుల నడుమనుండి యాతఁడు నిబ్బరముతో నేఁగును. అపాయభయముల నాతఁడు పాయఁద్రోచును.

తుపానులు వానిబుజములఁదాఁకి హోరు మనును. కాని వానిఁ గదలింపఁజాలవు. ఉఱుము లాతని తలచెంత నూరక మ్రోఁగును. మెఱుపు లాతనిముఖకాంతిని గనుపఱచుటకే యుపయోగపడును.

వానిపే రేమి ? స్థితప్రజ్ఞుఁడు.

ఆతఁడు భూమిపై నెంతదూరము నుండియేని యేతెంచును. తన యెదుట సుదూరముననున్న సుఖమును జూచును. ఆతనికన్ను లోకాతీతమైన తనస్థిరస్థానమును దిలకించును.

అక్కడి కాతఁడు చక్కఁగా నడచును. ధీరతతో దానిఁ జేరుకొనును. నిత్యముగా నచ్చట నెలకొనును.

మనుజుఁడా ! న్యాయ్యములైన విషయములందు నీహృదయమును నాఁటుకొనఁజేయుము. పిమ్మట మార్పు లేకుండుటే మానవునకు మహనీయమయిన పొగడ్తయని తెలిసికొనుము.

౩. దౌర్బల్యము

కొఅంతలకుఁ బుట్టిన కుఱ్ఱఁడా! నరుఁడా! గర్వివి, చంచలుఁడవు నయిన నీవు దుర్బలుఁడవుగాక మఱెట్లుండఁ గలవు. చాంచల్యము దౌర్బల్యముతో సంబంధము గలది కాదా? దౌర్బల్యములేక గర్వ ముండఁగలదా? ఒక దానివలని యపాయములను దప్పించుకొంటివేని తక్కిన వానివలని యపాయములను దప్పించుకొనఁగలవు.

నీవు దేనిలో మిక్కిలి దుర్బలుఁడవై యుంటివో యెఱుఁగుదువా? దేనిలో నేను మిక్కిలి బలిష్ఠుఁడను, మొనగాఁడను, ననుకొనుచు మురియుచున్నాఁడవో దానిలో; మఱియు, నీకున్నవస్తువుల నుంచు కొనుటలో, నీచెంతనున్న మంచిని జెల్లించుకొనుటలో:—

నీయాశలుకూడ దుర్బలములేకావా? నీవు కోరునదేదో అదియేని నీ వెఱుఁగుదువా? నీవు మిక్కిలి చిక్కులుపడి దేనికై దేవుళ్లాడెదవో అది చేకూఱినపై నీకుఁ దృప్తి యుండదు చూడు!

నీయెదుటనుండు సంతోషము దానిరుచి నేల కోలుపోవును? ఉన్నసుఖ ముకన్న రానున్నసుఖ మెక్కువరుచి గలదిగా నేల తోఁపవలెనో యెఱుఁగుము. ఉన్నసుఖములోని మేలు నీకు విసుగు గలిగించినది గావునను, రానున్నసుఖములోని కీడు నీకుఁ దెలియరాలేదు గావునను నట్లగుచున్నది.

సంతృప్తి నందియుండుటే గొప్పసౌఖ్యమని తెలిసి కొనుము.

నీయంత నీవు నీకు వలసినది చేకూర్చుకోఁ గల్గినను సృష్టికర్త నీ వడుగఁగల్గినదాని నంతను ననుగ్రహించినను సౌఖ్యము నీ సన్నిధిని నిలుచునా ?

అయ్యో ! నీదౌర్బల్యము దాని కడ్డుదగులుచున్నది. నీచాంచల్యము దాని నిషేధించుచున్నది.

పరివర్తనమే నీకు సౌఖ్యస్థానీయముగా నున్నది కాని స్థిరముగా నుండునదే స్థిరసౌఖ్యమును గూర్పఁగల్గును

పోయిన తర్వాతఁ బొగులుదువు. ఉన్నప్పుడు వానినిఁ దిన్నఁగాఁ జూడవు.

పోయినదానికంటె నిప్పుడు వచ్చినది హెచ్చుసౌఖ్యము నీయదు. ఎందుకు దీనిఁ గోరితినా యని నీలో నీవే కుందుదువు. నీవు తప్పు చేయని చొప్పేదో దానిని జూడు.

కోరికలఁ గోరుటలోఁ గాక నీకడ మఱియెందైన లోపము చూపట్టు చున్నదా ? చూపట్టుచున్నది. ఇంకను ప్రాప్యములయిన విషయములు కలిగి యుండుటలోను, ప్రాప్తము లయినచో వాని ననుభవించుట లోను,— మన మనుభవించుటవలన వస్తువులు వాని మంచిని గోల్పోవును.

ప్రపంచమున స్వాభావికముగా మధురములై యుండు వస్తువులు మన

యనుభవమునఁ జేఁదుగా మాఱుచుండును. మన యానందమున నుండి బాధపుట్టును, మన సుఖముననుండి దుఃఖము పుట్టును.

సుఖానుభవమున మితిగలిగియుండుము. అది నీయొద్దఁ గుదురుకొని యుండును. నీసంతోషము సద్హేతుకముగా నుండనిమ్ము. అట్లున్న యెడల దానియంతమునకుఁ జింతకానరాదు.

మోహోల్లాసములతో నిట్టూర్పులును గలసియుండును. కడపటి కాయుల్లాసములు నిన్ను సంతాపమునకు దుఃఖమునకుఁ బాల్పఱిచి చల్లారును.

ఎక్కువమక్కువపడి నీ వేవస్తువును సంపాదించితివో అదియే కొంతకు వెక్కసమై వికారముఁ బుట్టించును. అది నీ కొదవినపిదప విసుగు జనించును.

నీమెప్పులో గౌరవముగూడఁ జొప్పింపుము. నీస్నేహములో మోహమునుగూడఁ గలుపుము. అట్లుచేసితివేని యంతమున నత్యాశ్చర్యకరమైన తృప్తినందెదవు.

భగవంతుఁడు చెడుగులేని మంచిని నీ కీయలేదు. కాని యాచెడుగును దొలఁగించుటకుఁ దగుపరికరములఁగూడఁ బ్రసాదించియున్నాఁడు.

సంతోషము సంతాపరహితముగా లేనట్టే సంతాపము గూడ సంతోషరహితముగా లేదు.

సంతోషసంతాపములు విరుద్ధధర్మము లయినను కలసియే యున్నవి.

దుఃఖమే మనకుఁ బలుమాఱు పరితోషము నిచ్చును. అపరిమితా నందము తఱచుగాఁ గన్నీటితోఁ గలసియుండును.

బుద్ధిహీనుని చేతిలోనుండు సద్వస్తువులు వానిచెఱుపునకే తిరుగవచ్చును. జ్ఞానవంతులు చెడుగులోనుండి మంచికి మార్గములఁ గనుఁగొందురు. మనుష్యుఁడా ! నీ స్వభావము మిక్కిలి పసిలేనిదై దుర్బలమైయున్నది. కావున నీవు సంపూర్ణముగా మంచితనముతోఁగాని సంపూర్ణముగాఁ జెడ్డతనముతోఁగాని యుండఁజాలకున్నాఁడవు. సంపూర్ణముగాఁ జెడ్డ వాఁడవు కాలేనందుకు సంతోషింపుము. సంప్రాప్తమయిన మంచికి సంతోషింపుము.

మంచి గుణములు వేర్వేఱు సమయములందు వేర్వేఱుగా సందర్భించు చుండును.

అసాధ్యములను సాధించుటకై యత్నింపకుము. అవి యెల్ల నేనంద లేనయితినని వందుఱకుము.

ఏకకాలమందే ధనవంతుని దాతృత్వమును దరిద్రుని తృప్తిని నీవంద గల్గుదువా ?

వైధవ్యపు విశుద్ధిని జూపలేదని నీ ధర్మపత్నిని రోయఁ జూతువా ?

సత్యము ఒక్కటే. సంశయములు నీవు కలిగించుకొన్నవి. మంచి గుణములను గల్పించినవాఁడు వాని యుత్కృష్టతను గూర్చి యెఱు

కనుగూడ నీలోఁ బాదుకొల్పినాఁడు. నీయంతరాత్మ యాజ్ఞాపించినట్లు నీవు చేసెదవేని పర్యవసాన మెప్పుడును బాగై యుండును.

౪. జ్ఞా న ము చా లు మి

అందమైనది, అపేక్షింపఁదగినది, మనుష్యుఁడు పొందఁ దగినవానిలోఁ బొగడఁదగినది యేది? అది జ్ఞానమే కదా! అయినను, ఆ జ్ఞానమును బొందువా రెవ్వరు?

రాజనీతి నిపుణుఁడు తన కది కలదనును. రాజు తద్విషయమునఁ బొగ_డ్త తనకుఁ జెల్లుననును. కాని వాని యేలుబడిలో నున్నవాఁడు తనయేలిక కది కలదని యనుకొనుచున్నాఁడా?

మానవునకుఁ జెడు గావశ్యకము గాదు. ఉండెనేని దాని నుపేక్షించు టయు మంచిదిగాదు. కాని న్యాయము చూచి చూడనట్లుండుట వలన నెన్ని చెడుగులు నడచుచుండుట లేదు? రాజసభ శాసించుటచేఁ జెడుగు లెన్నో చేయఁబడుచున్నవి గదా!

పాలకుఁడా! నీవు జనసంఘము నాజ్ఞాపింపవలసినవాఁడవు. బుద్ధిగలిగి యుండుము. నీ యనుజ్ఞపై జరిగిన యకృత్య మొకటి, దండ్యులు పదుగురు నీచే దండితులు కాక తప్పించుకొనుట కంటె, చెడ్డదని యెఱుఁగుము.

నీ ప్రజలు బహుసంఖ్యాకు లయినప్పుడు, నీసంతాన మభివృద్ధి చెంది

నప్పుడు, వారి నపకార మెఱుఁగని యన్య ప్రజలను జంపుటకుఁ బంపు చున్నావు కావా !

నీకోరికకు గుఱియైన వస్తువు నీవేవురుబిడ్డల జీవితముల నపేక్షించున దై నను నర్పించి దాని నందుకొందువు కావా ! నిన్ను సృష్టించినవాఁడే వారిని గూడ సృష్టించె నన్న విషయమును నీవు విస్మరించుచున్నాఁడవు. నీరక్త మెంతవిలువ గలదో వారిరక్తము నంతవిలువగలదే యని నీ వారయ కున్నాఁడవు.

అప్రమాదమగు ధర్మాచరణ మసాధ్య మందువా ?

అట్లంటివేని నీమాటయే నిజముగా నిన్ను ఖండించుచున్నది.

దోషి యగువాఁడు తన తప్పు నొప్పుకొనుటకుఁగాను నీవు మాయ మాటలతో వానిపై మచ్చుచల్లుచున్నాఁడవు. అతని యెడ నీ వపరాధివి కావా ? నిన్ను వాఁడు శిక్షింపఁజాలఁడు గాన నీతప్పిదము గొప్పది కాకపోవునా ?

అనుమానముచే నొకనిపై దోష మారోపించి శిక్షించుచున్ననీవు తప్పు లేనివారిఁగూడ దండించుచుండవచ్చునన్న వెఱపును మదిలో నిలుపు కొన సాహసించెదవా ?

వానిదండనవలన నీకోరిక తీఱినదా ? వాఁ డపరాధము నంగీకరించు టచే నీయాత్మ యానంద మందినదా ?

నీపలుచుబాధ, చేసినతప్పు నొప్పుకొనునంత తేలికగాఁ,జేయనితప్పును గూడఁ నొప్పుకొనునట్లు వానిని వ్యధపఱుచును ; నీవు పఱుచుబాధ నిర్దోషులను దమనిర్దోషిత్వమునుగూర్చి చింతించువారినిగాఁ జేయు చున్నది.

కారణములేకుండ శిక్షింపరాదని నీవు కారణముకొఱకై శిక్షకంటె హెచ్చుగా వానిని హింసించుచున్నాఁడవు. దోషము నొప్పించుటకుఁ జేయు ప్రయత్నములో నిర్దోషిని నీవు నాశమందించు చున్నాఁడవు.

సత్యము నేర్పఱింపఁజాలని గ్రుడ్డిమొగమా ; భగవంతుఁడు నిన్ను నీ రాచనడవడికి బదులు పలుకుమన్నప్పుడు నిర్దోషినొకని బాధించుట కంటె దోషులఁ బదివేవురను వదలి పుచ్చుట మేలని యెఱుఁగఁ గల్గుదువు.

నీవు న్యాయమును నిలువరింప నేరనివాఁడవై యెందువేని సత్య జ్ఞానము నెట్లు సంపాదింపఁగల్గుదువు ?

సూర్యరశ్మి గ్రుడ్లగూబను గ్రుడ్డిదానిఁగాఁ జేయునట్లు సత్యదేవత తేజము నీ వామెసన్నిధి కేఁగునప్పుడు నీకన్నులకు మిఱుమిట్లు గొల్పును.

ఆమెసింహాసనము నధిష్ఠింపఁగోరుదువేని తొల్త నామెపాదపీఠమునకుఁ బ్రణమిల్లుము. ఆమెను దెలిసికొనఁ గోరితివేని తొలుత నీయజ్ఞాన మును దెలిసికొనుము.

ఆణిముత్తెములు, నాణెములు, వజ్రములు, రవ్వలు నామె సింహాసనము చెంతనుండు చెత్తచెదారములు. నిబ్బరముతో నామెకొలువు గోరుము.

ఆమె కొలువుకూటము నెంతో పరిశ్రమించి నడచినఁగాని పడయరాదు. తత్పరతయను మార్గదర్శకుఁడు నీకామె దర్శనముఁ గూర్పఁగలఁడు.

బడల్పడి నీవాబాటను నడుమ విడనాడకుము. కడచన్న పిదప నీకష్టమెల్ల నుల్లాసకరమేయగును.

సత్యము ద్వేషమును బుట్టించునుగాన దాని నేను విడుతును గాకయని నీలో నీవనుకొనకుము. మిథ్య మిత్రులను సమకూర్చును గాన దానినే నాదరింతును గాకయని కూడ ననుకొనకుము.

సత్యముచే నేర్పడ్డవిరోధులు మోసముచే నేర్పడ్డ స్నేహితులకంటె నెక్కువవారు కారా ?

స్వాభావికముగా మనుష్యుఁడు సత్యమును గోరును. కాని యది తన యెదుటనున్నప్పుడు గుర్తింపఁజాలఁడు. బలాత్కారమున నది యెదుర్కొన్నప్పుడు దానిపైఁ గినుకఁ బూనును. అది సత్యము దోషము గాదు. మానవుని దౌర్బల్యము దానితేజమును నిబ్బరింపఁ జాలదు.

నీయసమర్థత నింతకంటె స్పష్టముగాఁ జూచెదవా ? నీ విశ్వాసముల విషయమున నిన్ను నీవ చూచుకొనుము. మతనియమము లెందుకొఱ

కేర్పడినని ? నీలోపములఁ జూపుటకు; భగవంతునివలన నీకు మేలు కలుగఁగలదని తెలుపుటకు. అంతేకాదా ?

నీవు మృత్తుల్యుఁడవని నీకది తెలుపుటలేదా ? పశ్చాత్తాపము నర యుము. అది దౌర్భల్యముపై నాధారపడినదికాదా.

నీవు ఒట్టుపెట్టుకొన్నప్పుడు, మోసగింపనని శపథముచేసినప్పుడు, చూడుము; అది నీముఖముపై నవమానము నావరింపఁ జేయుచున్నది. వానిఁ గొన్నవానిముఖమును గూడ నవమాన పఱచుచున్నది. న్యాయ్య వర్తన మలవఱుచుకొనుము. అప్పుడు పశ్చాత్తాపమునకుఁ బాల్పడవు.

సత్యవర్తనము సాగింపుము. అప్పుడు ఒట్లనావశ్యకములగును. పొరఁబాటు లెవ్వరికిని గలుగకతప్పవు. కొలఁది పొరఁబాట్లకు నేనేల పాల్పడవలెనని గొప్పతప్పిదము గూలకుము.

తనతప్పుల నోపికతో వినువాఁ డితరులను ధైర్యముతో మంద లించును.

సహేతుకముగా నడ్డుపలుకువాఁ డోటమికల్గునేని దాని నిబ్బరముతో నొందఁగలఁడు.

నిన్నెవరయినను సంశయముతోఁ జూతురేని నిర్భయముగా వారికి బదులుపలుకుము.

తప్పుచేసినవానిఁగాక సంశయము మఱెవ్వరినీ జంకించును.

మృదుహృదయుఁడు ప్రార్థనములచే మెత్తఁబడును; శఠ హృదయుఁడు ప్రార్థనములచే మఱింతహఠముఁబూనును.

నీయందుఁగల యజ్ఞానము ని న్నితరులు చెప్ప దానివినిపించును. అట్లు కాకున్నను, న్యాయము జరుగుటకు నీవితరులు చెప్పుదాని నోర్మితో వినవలయును.

౫. దౌర్భాగ్యము

మంచియందుఁ జాలనితనముతో, బేలుఁదనముతో, సౌఖ్యమందుఁ జాంచల్యముతో, దౌర్బల్యముతో వర్తించు మానవుఁడా! నీ వొక విషయమున మాత్రము, సమర్థుఁడవు, స్థిరుఁడవునై యున్నాఁడవు. అదేది యనఁగా దౌర్భాగ్యము.

అది నీజీవిత లక్షణము. అది నీస్వభావపు విశేషధర్మము. నీవు లేక యదియుండదు. చూడుము దానికి నీకామక్రోధ మదమాత్సర్యాదులే జనన కారణము.

వీని నీకిచ్చినవాఁడు వీనిని లోఁ గొనుటకు నీకు బుద్ధిని గూడ నిచ్చి యున్నాఁడు.

బుద్ధినుపయోగింపుము. హాని నణఁగఁ ద్రొక్కివేయఁ గల్గుదువు.

నీకీ ప్రపంచమునందుఁ బ్రవేశ మవమానముతోఁ గూడినది కాదా? నీకు వినాశనము మాననీయము కాదా?

మానవులు మరణసాధనములను, బంగారుతోను, మణులతోను, అలంకరించి, నగలకంటె నెక్కువగా నుదుపులపై ధరింతురు.

మనుష్యునిఁ బుట్టించువాని కెట్టి గౌరవమును లేదు. పదుగురఁ జంపువానికిఁ బ్రఖ్యాతికలదు.

అయినను నిది తప్పిదమని నీవెఱుఁగవలయును. పరిపాటి సత్యగౌరవమును జంపఁజాలదు. న్యాయము నొకమనుజుని యభిప్రాయము నాశపఱుపఁజాలదు. గౌరవము, అవమానము, సరియగు స్థానములందు స్థాపితములు గాకున్నవి.

మనుష్యుడు కలుగుట కొకటే మార్గము కలదు. కాని వాని వినాశనమున కనేకమార్గము లున్నవి.

మనుష్యునకుఁ బుట్టుక నిచ్చినవానికిఁ బొగడ్త, గౌరము, కలుగదుగాని, పలువుర మనుష్యులఁ జంపినవానికి జయములు, రాజ్యములు, పారితోషికములుగాఁ బ్రాప్తములగును.

నిజమునకు, ఎందఱు బిడ్డలుందురో అన్ని సుఖములున్నవి. ఒకని ప్రాణములఁ దీసినవాఁడు తనప్రాణములవల్ల సుఖింపఁజాలఁడు.

కొడుకు పుట్టినందుకుఁ గోపించి తండ్రి చచ్చినందుకుఁ దనియునట్టి వాఁడు రక్కసిగాఁడని పించుకోఁడా ?

మనుష్యునకుఁ జెఱుగు కావలసినంతగలదు. దానిఁగూర్చి దుఃఖించు వాఁడింకను దానిఁ ద్రవ్వితండము గావించు కొనుచున్నాఁడు.

మానవునకుఁగల దోషములలోనికెల్ల దుఃఖము గొప్ప దోషము. నీవు చాలదుఃఖ మనుభవించుటకుఁ బుట్టియున్నాఁడవు. ఆ దుఃఖమును దుర్బుద్ధిచే నీవు పెంపొందించుకొనకుము.

దుఃఖము నీకు నిత్యము. అదినిన్నెప్పుడు నంటియుండును.సంతోషము నీకు నైమిత్తికము. అది నీయొద్ది కపుడప్పుడు వచ్చును. వివేచన శక్తిని బాగుగా నీవు వినియోగించితివేని దుఃఖము తొలఁగిపోవును. బుద్ధిగలవాఁడవై యుందువేని సంతోషము నిన్ను దర్శించి చాలఁ గాలము నీసన్నిధి నుండును.

నీమేనిలోని ప్రతిభాగమును దుఃఖమునకుఁ ద్రోవలై యున్నవి. కాని యానందమార్గములు మాత్రమల్పములై యరుకై యున్నవి.

సౌఖ్యములపుడప్పు డొక్కటొక్కటిగానే సంపాదింపఁ దగినవగును. దుఃఖము లొకప్పుడే దొంతరలు దొంతరలుగాఁ ద్రోసికొనివచ్చును.

తాటియాకుమంటతగులఁబడఁగానే పోయినట్లు సంతోష ప్రకాశముగూడఁ జక్కఁగాఁజూడకమునుపే చల్లారును.

దుఃఖము పలుమాఱువచ్చును. సంతోషము సకృత్తుగావచ్చును. కష్టము తనంతటఁ దానేవచ్చును. ఆనందము కొనితెచ్చుకోవలసినది.

దుఃఖము తోడులేనిది. ఆనందము దుఃఖముతో డంటీనది.

మంచియారోగ్యము కొంచెపుజబ్బంత స్పష్టముగా మనకు గోచరముగా నట్లు గొప్పసంతోషము కొద్ది దుఃఖముకంటెఁ దక్కువగా మనలఁ దాకును.

మనము బాధను ప్రేమింతుము. సంతోషమును దఱుచుగా జాఱ విడుతుము. ప్రయత్నించి దానిని బడయుదుమేని ప్రయత్నించునప్పటి శ్రమము, పడసినతర్వాతి సౌఖ్యమును మించి యుండును.

వివేచన మను జుగినిపని. తనస్థితినిగూర్చి తెలిసికొనుట మనుజునకుఁ బ్రధానధర్మము. కాని సంతోష కోలాహలమున మనుజుఁడు దనను దాను దలఁచుకొనఁ జాలకుండును. ఈశ్వరుఁడు మనకు కరుణతోనే దుఃఖమును గల్పించియున్నాఁడు.

రానున్న చెడుగును మానవుఁడు ముందుగానే తలపోయును. కడచి పోయినతర్వాత దానిని జ్ఞప్తియందుంచుకొనును. దుఃఖమును గూర్చి యాలోచన దుఃఖముకంటె నెక్కువ బాధగలిగించునని యాతఁ డాలోచింపఁడు.

కలిగిన పిమ్మటనే కష్టమునుగూర్చి చింతింపుము. అంతకు ముందు దానిఁగూర్చి యాలోచింపకుము. అట్లుచేసితివేని బాధాధిక్యముననుండి నీవు బయల్పడుదువు.

ఎదరు రాకముందే యేడ్చువాఁడు, ఏడ్వఁదగి నంతకంటె నెక్కువగా

నేర్చును. ఏమనఁగా వాఁడేర్చిన కిష్టపడువాఁడు.

కత్తిని దనమీఁది కెత్తినఁగాని దుష్టి దుఃఖింపదు.

చావువచ్చునన్న భయముచే మనుష్యుఁడు దానిని సమీపించుచున్నాఁడు. చావుకంటె జావుభయమే యెక్కువ బాధకము.

నీవుచేయుకార్యముల కెల్లప్పుడును ప్రత్యుత్తర మిచ్చుటకు సంసిద్ధుఁడవై యుండుము. ముందుగా విచారమున ముంపకుండ వచ్చెడు చావు మంచిచావు. 

## ౬. వి వే క ము



వివేకమును, బూనికిని, మహౌదార్యముతో భగవంతుఁడు మనుష్యున కిచ్చినాఁడు. వానిని దుర్వినియోగము పాలుచేయనివాఁడు సుఖపడును.

పర్వతము పయినుండి దొరలివచ్చు ప్రవాహము తనతోఁ గొట్టుకొని వచ్చుదాని నంతను నాశముచేయునట్లు ప్రజాసామాన్యపు టభిప్రాయము విచారణములేకుండఁ దనకు లొంగియుండువాని వివేకమును ముంచివైచును.

నీవు నిర్మలహృదయముతో సత్యమని గ్రహించునది సత్యాభాసము కాకుండునట్లు జాగ్రత్తతో నుండుము.

కంటికి నచ్చినంతమాత్రముననే నీవు తఱచుగా దేనినేని మెచ్చుకొను

చుందువు. జాగ్రత్తతో నుండుము. కనుపేఁదుఱు గొనకుము. నీలో నీవే యోజించుకొని నిశ్చయించు కొనుము. నీతప్పునకే నీవు బదులు చెప్ప వలసిన వాఁడవు.

కార్యఫలము దాని యుక్తాయుక్తతలను వ్యక్తపఱుచునని యనకుము. మానవుఁడు దైవికములకు లోనై యున్నాఁడు.

ఇతరుని యభిప్రాయము నీయభిప్రాయమునకు భిన్నమైయున్నచో దానిని ద్వేషింపకుము, ఇరువురుసు బొరఁబడి యుండఁగూడదా ?

బిరుదుబింకము లున్నంత మాత్రాన నొకనిఁ బొగడి అవి లేనంత మాత్రాన వేఱొకనిఁ దెగడుదువా ? ఎవ్వఁడో యట కొమ్మునుబట్టి నీటిలో నున్నగొడ్డు తీరును గుర్తించెనట ! మఱియు ముకుఁద్రాటిని బట్టి లోఁబెపెట్ట గుణమును గుర్తించెనట !

విరోధిని జంపినప్పుడు కసితీర్చుకొంటినని తలంపకుము. వానిని దూరమునకుఁ ద్రోచితివి. వానికి శాంతిఁ జేకూర్చితివి, అపాయము చేయు విధానముల నన్నింటిని నీవలన నుండి నీవ తీసి వైచుకొంటివి.

నీకుఁ గలదానిని దృఢీకరించుకొని యితరునికిఁ గలదానిని ఘనముగాఁ గౌరవించుట సరికాదు. గుణవంతునియొద్ద నున్నవస్తు వెక్కువ విలువ గల దగును.

నీకు లోపడియున్న దన్న కారణమున నీభార్యను నీచముగాఁ జూడ కుము. తక్కువగా నెవతెను బ్రేమింతువో దానిని బెండ్లాడు మను

వానిమాటను దృఢీకరింపుము. నీసౌశీల్యమునెడఁ గల్గు నమ్మకము చేతనే యాపె నీకు లోపడెను. ఎక్కువగా నిన్నామె యెంచి నందుకుఁ దక్కువగా నీ వామెను దలఁతువా ?

పెండ్లి వేళ నీవు న్యాయ్యమైన ప్రేమముతోఁ జూచి వరించి యుందు వేని, యటుపై నీవామె నొకప్పుడనాదరముతోఁ జూచినను నామెను గోల్పోవుట నీకు శోకమును గూర్చును. తనకు భార్యగా నున్నంత మాత్రముననే కాంతను గుణవంతురాలని తలఁచువాఁడు నీకంటె హెచ్చుగా జ్ఞానము గలవాఁడు గాకున్నను సౌఖ్యముగలవాఁ డగును.

నీమిత్రుఁడు పొందిన నష్టమును వాఁడు కార్చుకన్నీటిని బట్టి లెక్కింపకుము. గొప్పదుఃఖములను గన్నీరు మొదలగునవి కన్పఱుపఁ జాలవు.

ఆడంబరముతోను మ్రోఁతతోను ఆచరింపఁబడు కార్యమును హెచ్చుగా నెన్నకుము. గొప్పవాఁడు గొప్పపనులను జేయుచుండును గాని యాచేఁతలలో మ్రోఁతలు మొరపములు నుండవు.

కీర్తి వినువానికి వింతగొల్పును. కాని యది కలవానికిఁ గడు ముదము గూర్చును.

మంచికార్యమొకఁడు చేయునప్పుడు దానికిఁ జెడ్డకారణముల నారయకుము. వానిహృదయమెట్టిదో నీవెఱుఁగఁ జాలవు. దీనిచే నీహృదయ మసూయాపూరిత మని లోకమునకు వెల్లడియగును.

కాపట్యమునఁ దప్పిదమే కాని యెక్కువ దౌర్మార్గ్యము గానరాదు. సత్యవంతుఁడుగా నటించు టెంతసులువో సత్యవంతుఁడుగా నుండు టంతసులువు.

అపకారికిఁ బ్రత్యపకారము చేయుటకుఁగాక యుపకారికిఁ బ్రత్యుప కారము చేయుటకే నీ వెక్కువగా సంసిద్ధుఁడవై యుండుము. అట్లుం టివేని కీళ్లుగాక నీకు మేళ్లే మిక్కిలిగాఁ గల్గును.

ద్వేషించుటకుఁగాక ప్రేమించుటకే నీవు సిద్ధపడియుండుము. అట్లుంటి వేని శత్రులుగాక నీకు మిత్రులే మిక్కిలిగాఁ గల్గుదురు. శ్లాఘించు టకు నీవు సంసిద్ధుఁడవై యుండుము. ఆక్షేపించుటలో నాఁగి యాఁగి మెలఁగుము. అట్లు మెలఁగితివేని నీసౌశీల్యము శ్లాఘ్య మగును. నీపెద్దతనమును గుర్తించుటలో శత్రువులు గ్రుడ్డివాం డ్రగుదురు.

నీ వేదైన సత్కార్యము సల్పుదువేని దానిని వారును వీరును మెత్తురన్న కారణముచేఁ గాక సత్కార్యమన్న కారణముచేతనే సల్పుము.

నీవేదైన దోషమువనుండి తొలఁగిపోఁ జూతువేని దానినుండి వారును వీరును దూరుదురన్న కారణముచేఁ గాక దోషమన్న కారణముచేతనే తొలఁగిపొమ్ము.

సత్యము మీఁది ప్రేమముచేతనే సత్యవంతుఁడవుగా నుండుము. అట్లైని నీ వెల్లప్పుడు నట్లే యుండఁగలవు. ఇతర కారణములచే సత్యమును బాటించువాఁ డిటు నటుఁ జలించుచుండును.

జ్ఞానహీనుని మెప్పుకంటె జ్ఞానవంతుని దెప్పు నీకు గోరఁదగినది. జ్ఞానవంతుఁడు నీవు త్రిప్పుకొందు వనియే నీతప్పును దెప్పును. జ్ఞానహీనుఁడు తన్నుఁ బోలినవాఁడవని నిన్ను మెచ్చుకొనును.

అర్హతలేనిపనిలో నడుగిడకుము. ఏలనఁగా నం దధికనైపుణ్యము గలవాఁడు నిన్నవమానించును.

ఎఱుకచాలనిదాని నొకనికిఁ గఱపఁ బోవకుము. అది యెఱిఁగి నిన్ను వాఁ డవహేళనము చేయును.

నిన్ను బాధించినవానితో నెయ్యము చేయకుము. బాధపడినవాఁడు దానిని బాటింపకుండిననేమి? బాధపఱిచిన వాఁడెప్పుడును బాడుబుద్ధితోనే యుండును.

నీ వెవని నైన మిత్రునిగాఁ గూరుచుకొనఁ గోరెదవేని వానిమీఁద నెక్కువ భారము మోపకుము. భారము వానిని నీయొద్దనుండి దూరీకరించును.

కొంచెము లాభముఁ గోరితివా చెల్మి చెడవచ్చును. చాలఁగా లాభముఁ గోరితివా శాత్రవమే రావచ్చును.

అయినను గృతఘ్నత మనుష్యభావమున లేదు. కోపముగూడ మనుష్యస్వభావమున మాపరానిదిగానుండదు. కాని మానవుఁడు తాను దీర్పఁజాలనంత ప్రత్యుపకారస్థితిని స్మరింపనొల్లఁడు. తనవలన బాధ నొందినవారియెదుటఁ దాను నిల్వ నొల్లఁడు. సిగ్గిలును.

పరుని మేలును జూచి పరితాపపడకుము. అహితునియాపదను జూచి యానందింపకుము. అట్లేని నీవలె నితరులును ప్రవర్తించిన నీ కెట్లుండునో చూచుకొమ్ము.

అందఱ దయను నీవు పొందఁగోరెదవా? అందఱకు నీయౌదార్యమందు నట్లుండనిమ్ము. అంద్రఱదయను నీవు పొందుట కింతకంటె వేఱుపుంత లేదు. ఒకవేళనందఱదయను నీ వందఁజాలకపోయినను నందుట కర్హుఁడ వను సంతోషమున నుందువు.

౭. అ హం కా ర ము

అహంకారము, నైచ్యము, విరుద్ధధర్మముల ట్లగపడుచున్నవి. అయినను మనుజుఁడు ప్రతికూలముల ననుకూలపఱుపఁగలఁడు. జీవకోట్లలోనెల్ల మానవుఁడే యహంకారి. అభవ్యుఁడు.

అహంకారము వివేకమునకు విరోధి. అది తప్పిదమునకు దాది వంటిది. దానికి మనుజునిలోని వివేచనాశక్తి యానుకూల్యముతో నుండును.

తన్నుఁగూర్చి యెక్కువగాఁగాని యితరునిఁగూర్చి తక్కువగాఁగాని తలఁపనివాఁడెవ్వఁడు?

సృష్టికర్తగూడ మన యహంకారమునుండి తప్పించనఁజాలఁడు. ఇఁక మనలో నొకరి కొకర మెట్లు తప్పించుకొని యుండఁగలము.

మూఢభక్తి యెందులనుండి పుట్టుచున్నది? అసత్యమైన యారాధన మెందులనుండి యేర్పడుచున్నది? మనకుఁ దెలిసికో నలవిగానిదానిఁ గూర్చి చర్చించుట, అర్థముగాని దానిఁగూర్చి యర్థముచేసికో యత్నించుట, యనువాని యందునుండి; మనోబలము మనకుఁ దక్కువగా నున్నది. అయున్నదానినిగూడ మనము సక్కఁగా సక్రమముగా నుపయోగించుకొనము.

ఈశ్వరునిమహనీయతను గనుఁగొనుటకు మన మెగురవలసినంత యెత్తుగా నెగురుటలేదు. మనము భగవద్విలాసములందు భయ భక్తి ప్రేమ నిమగ్నులమై యుండునపుడు మనభావములకుఁ దగినంత బలము నిచ్చుటలేదు. అవి చక్కఁగా నెగురుటకుఁ దగినతెక్కలఁ గట్టుటలేదు.

పాలకునిపనులకు విరుద్ధముగా గుసగుసలాడుటకుఁ గూడ భయపడు వాఁడు పరమేశ్వరుని విధానములపై నేరమి మోపుటకు భయపడఁడు. ఆమహామహిముని మహనీయత మఱపునఁ దగులుటచే నాయన తీర్పులనే తాను మార్పఁజూచును.

తనరాజుపేరును దీరు దప్పి చెప్పుటకు ధైర్యము చాలనివాఁడు అఖిల లోకనాయకుని నొక యబద్ధమునకు సాక్షివై రమ్మని పిలుచుటకుఁ దలఁకఁడు.

న్యాయాధికారి యాజ్ఞకుఁ గిక్కురు మనకుండ లోఁగువాఁడు సర్వేశ్వరుని యాజ్ఞతో స్పర్థించును. ఆసర్వేశ్వరుని నభ్యర్థనములచే లోపఱు

చుకొన యత్నించును. వాగ్దానములచే వశపఱుచుకొనఁ జూచును. అంతే కాదు. మఱి తనమాట వినకపోయినచో మటమట లాడుటకుఁ గూడఁ బ్రయత్నించును.

మనుష్యుఁడా ! నీ వెన్నోపాపములఁ జేయుచుంటివే ! ఏల శిక్షింపఁబడ కున్నాఁడవో యెఱుఁగుదువా? ఈకర్మఫలము గుడుచుట కిది కాదు సమయము.

ఉఱుములు గలిగించువానిని జక్కఁదిద్దుటకై, యుఱుములతోఁబోరాటము సల్పువాని పోలిక నుండకుము. బాధించునుగదాయని యాభగవంతుని ప్రార్థనములందుఁ దూఱకుము. ఈవిషయమున నీపిచ్చితనము నీతలమీఁదనే యున్నది. నీపాపము నిన్నేకాని మఱెవ్వరిని బాధింపదు.

భగవంతునకుఁ దానిష్టుఁడనని భావించుమనుష్యుఁడు కృతజ్ఞతా బుద్ధిని జూపుట కేల ప్రాల్మాలవలెను. అట్టిభావన గలవాని కకృతజ్ఞత యెట్లు న్విత మగును.

అఖండమైన యావిశ్వమున మనుష్యుఁ డొకయణుమాత్రము. అట్టివాఁడు తనకోసమె సృష్టియెల్ల నేర్పడినదనుకొనును. ప్రపంచమంతయును దనబాగుకోసమే ప్రవర్తిల్లుచున్న దనుకొనును.

నీటిలోనిప్రతిబింబములు వృక్షములు పట్టణములు నభోమండలము ఇత్యాదులెల్లఁ దనసంతోషార్థము సంచరించుచున్నవని బుద్ధిహీనుఁడు తలఁచును. స్వాభావికముగా బ్రపంచము సాగుచుండగాఁ నదియెల్లఁ దన ముదమునకే యని మూర్ఖుఁ డనుకొనును.

వెచ్చనకై సూర్యకిరణముల వేఁడుచు వాఁడు సూర్యుఁడు తనకై సృష్టింపఁబడె ననుకొనును. చల్లఁగా రాత్రివేళ చంద్రమండలమును దిలకించుచుఁ దనసంతోషమునకె చంద్రుఁడు సృష్టింపఁ బడెనని వాఁ డనుకొనును.

పొగరుచే మతిఁబోఁగొట్టుకొన్నవాఁడా! పగలఁబడకుము. అడఁకువ గలిగియుండుము. ప్రపంచ ప్రవర్తనమునకు నీవేకాదు ప్రయోజనము. ఇది యెఱుఁగుము. ఋతువుల గతి నీకోసమే నెగడలేదు;

మనుష్యజాతియే లేకపోయినఁ బ్రపంచమున నేమార్పును గలుగదు. సరియేకాని, నీవు ప్రపంచమునఁ బ్రసాదింపఁబడిన వారిలోఁ గోటాన కోట్లలో నొక్కఁడవు!

నిన్ను నీవ మిన్ను ముట్టించుకొనకుము. అదిగో నీకు మీఁద దేవత లున్నారు. నీతోడభూమిమీఁద నివసించు నితర జీవులు నీకంటెఁ దక్కువవని తృణీకరింపకుము.

ఆజీవులును నీవలెనే దేవునిచే సృజింపఁబడెను.

దైవానుగ్రహముచే సౌఖ్యమందుచున్న నీవు, కావలెనని దైవము చేతనే సృజింపఁబడిన జీవులను గష్టపెట్టుటకుఁ గడంకవహించెదవా? ఆకష్టములు నీకుఁ గలుగకుండ జాగ్రత్తతో నుండుము.

నీవలెనే యవియు దైవమును గొలుచుచున్నవి. వానికి వానికిఁదగిన

వర్తనముల నాయీశ్వరుఁ డేర్పఱిచి యున్నాఁడు. వానిని రక్షించుభార మా యీశ్వరునిపై నున్నది. దానిని నీవు దప్పింతువా ?

నీవివేకమును లోకవివేకముపై నెక్కింపకుము. నీయుద్దేశముతోఁ నేకీభవింపనివానినిఁ దప్పుతలఁపు వానినిగాఁ దలంపకుము!

ఇతరులకు నిదమిత్థమని యేదియేని యేర్పరింప నీ కెవ్వరధికార మిచ్చిరి? ప్రపంచముననుండి ప్రశస్తముల నెత్తుకొన్న వారెవ్వరు?

ఇప్పుడు ప్రశస్తములుగా నెన్నఁబడుచున్నవెన్నో పూర్వము పనికి మాలినవిగాఁ బరిత్యజింపఁబడెను. నేఁడు మానితములగుచున్నవి రేపవమానితములుగావచ్చును. దేనినిగూర్చి మనుజుఁడు స్థిరుఁడుగా నుండఁగలడు ?

నీకుఁ దెలిసినంత వఱకు మంచిని జేయుము. సుఖపడుదువు. సౌశీల్యమే యీలోకమున నీకు సంపాదింపఁ దగినది.

మన కెఱుఁగరానిదానిలో యుక్తాయుక్తత లోకవిధముగానే యుండును.

ఇది యుక్త మిది యయుక్తమని యేర్పరించు నది మన యహంకారమే తక్క నన్య మేది?

మన గ్రహణ శక్తిని మీఱియున్న దానిని దేలికగా నమ్మెదము. మన మెఱుఁగుదు మని యితరు లెన్నుటకై యెఱుఁగనిదానియందుఁ

గూడ నమ్మక మున్నట్లు నటింతుము. ఇదిపొరఁబాటును, పొగరును గాదా?

ఇదమిత్థమని గ్రుద్దిచెప్పఁబూను వాఁడెవ్వఁడో, ముక్కుపట్టుతోఁ దన యభిప్రాయమునే చిక్కఁబట్టుకొనియుండువాఁ డెవ్వఁడో యెఱుఁగుదువా? మతిమాలినవాఁడు. వాఁ డహంకారముగూడఁ గలిగి యుండును.

ప్రతి మనుష్యుఁడును దనయభిప్రాయమును బాలించుకొనుట కిష్టపడు చుండును. అహంకార భరితుఁడు మఱియు నందులకై కష్టపడును. వాఁడు తనయభినివేశమునఁ దనయాత్మను వంచించుకొనుటతోఁ దనివి నందక యితరులనుగూడఁ దనత్రోవకుఁ దెచ్చుకొనుటకు నిర్బంధించును.

సత్యము స్థాపితమగుట కేండ్లును బూండ్లును బట్టును. దేనినేని నమ్మువారు పలువురు తమనమ్మకములందు స్థిరతలేనివారై యుందురు.

తర్కము, తారతమ్యము లేర్పఱుపఁ జాలనప్పుడు వేర్వేఱు మానవాభిప్రాయములు సమబలముగలవి గానే యుండును.



# నీతి నిధి

## తృతీయాధ్యాయము

# స్వపరానర్థకము లగు వ్యామోహములు

౧. దురాశ

భాగ్యము మిక్కిలిగా బాధపడి ప్రయత్నించి పడయ వలసినంతయావశ్యకత గలదిగాదు కాన దానికై మనస్సునఁ గలవరపాటు తగదు.

మనుష్యునకుఁ మంచియనుదానిని బొందఁగోరుటయు, దానిని బొందుటవలని సౌఖ్యమును నతని మనసులోనే యున్నవి. వానిని నీచజనులను జూచి నేర్చుకొనఁదగదు. ప్రతివిషయమునుపయోగమును దానే పరీక్షించి చూచుకొనఁదగును. అప్పుడాతనివి దురాశయంటదు.

మితిమీఱిన ధనాపేక్షహృదయగతమైన విషమువంటిది. అదియంతర్గతమైన మంచి నంతను జెఱిచివైచును. ఆవిషములోఁ జేరినతోడనే సౌశీల్యము, న్యాయచింత, ప్రేమ, చచ్చిపోవును.

దురాశావిష్టుఁడు బంగారమునకుఁ దనబిడ్డల నమ్మను. తనతలిదండ్రులు చచ్చుచున్నను గూడ వాఁడు ధనపుఁబెట్టె తలుపు తెఱవ

వెనుకాడును. ఆత్మసౌఖ్యమును గూడనాతఁ డాసింపఁడు. ఆత్మసౌఖ్యమును బడయఁగోరియు నాతఁ డసౌఖ్యము నందును.

ధనము సంపాదించి దానిచే నిఁకముందు సౌఖ్యమందుమనని తలఁచి ధనార్జనార్థమై శాంతిసౌఖ్యములను గోల్పోవువాఁడు గృహము నలంకరింపవలెనని యలంకార సామగ్రిని గొనుటకుగా నింటి నమ్ముకొనువాని వంటివాఁడగును.

దురాశావిష్టుని హృదయము నీరసించియుండును. భాగ్యమే మనుష్యునకుఁ బ్రధానముగా నపేక్షింపఁ దగినదియని తలంపనివాఁడు భాగ్యము కొఱకయి యితర ప్రయోజనముల నుజ్జగింపఁడు.

దారిద్ర్యముతనకు మహానర్థ మని తలఁపనివాఁడు దానిని దొలఁగించుకొనుటకయి యనర్థాంతరముల నన్వేషింపఁడు. మతిమాలినవాఁడా! సౌశీల్యము భాగ్యముకంటెఁ జాల మేలయినదికాదా! దారిద్ర్యముకంటెఁ బాపము నీచమయినది కాదా! అవశ్యకముల నార్జించుకొను శక్తి ప్రతిమనుష్యునియందు నున్నది. ఇదియెఱిఁగి యింతతోఁ దృప్తి చెందియుండుము. అవశ్యకములకంటె నెక్కువ యపేక్షించువాఁడు, దుఃఖము లందుచుండఁగా నీవు నవ్వుచుండవచ్చును.

చూడరాని దని స్వాభావికముగా బంగార మెక్కడనో భూమిలోఁ బూడిచిపెట్టఁబడియున్నది. వెండిమాత్రము పాదములకుఁ దగులునట్లు భూమి పయితట్టుననే పెట్టఁబడి యున్నది. ఇట్లుండుట నీకు బంగారమునుగూర్చి పర్యాలోచించుటయుఁ దగదని తెల్పుచున్నదిగదా!

దురాశ వేలకొలఁది దరిద్రులను భూమిలో బ్రుంగించును. వాండ్రు కఱకుగుండెగల యజమానుని కొఱ కని భూమిని ద్రవ్వెదురు. అట్లు భూమిద్రవ్వి బంగారుఁగొని తెచ్చుట, వాండ్రను మఱింత బాధితులను గాఁజేయును. వాండ్ర నది యాజీవితము దాస్యమందే యణఁగఁ ద్రొక్కును.

బంగారు గనులుగల భూభాగము గొడ్డువోయి యుండును. భూమిలో నెచట బంగారమున్నదో అచ్చటి పైతట్టునఁ బచ్చికయు మొలవదు.

అస్థలమునఁ బచ్చిక మొలవనట్లే, పైరుపచ్చలు కానరానట్లే, ఫల వృక్షములు లతలు వెలయనట్లే, భాగ్యమునే నిండించుకొనుచు దానినే పరికించుకొనుచు నుండవాని హృదయమునఁగూడ మంచితనము పుట్టదు. పెఱుగదు.

జ్ఞానవంతులకు ధనము సేవకుని వంటిది. మఱియునది బుద్ధిహీనునికిఁ గ్రూరప్రభువు వంటిది.

దురాశావిష్టుఁడు భాగ్యమునకు సేవకుఁడు. అంతేకాని భాగ్యము వాని సేవ కుపయోగింపదు. వ్యాధితునికి జ్వరమువలె నాతనికి భాగ్య ముండును. వానినదికాల్చి ప్రేల్చి బాధించుచుండును. చచ్చువఱకు నట్లే సంకట పఱుచును. భాగ్య మెందఱ సౌశీల్యమును బాడుచేయు చుండుటలేదు! మంచికది యెందయినఁ దోడ్పడుచున్నదా ?

అది మనుష్యాధముల దగ్గఱ నెక్కువగా నెలకొని యున్నది. ఎందు కోయీ! దానినిజెంది ఘనతగాంతునను కొందువు ?

విజ్ఞానసంపన్నులు పలువు రల్ప భాగ్యులేయగుట నీ వెఱుఁగవా? భాగ్యముకంటె జ్ఞానము సౌఖ్యదాయకముగాదా! పలువురు నీచులు మిక్కిలి భాగ్యవంతులుగా నుండుట నెఱుఁగవా? వారి యవసానదశ యసందర్భముగా నుండుటలేదా?

పేదఱికము తన కనేకవస్తువులు కావలయుననును. దురాశ తన కేదియు వల దనును.

దురాశావిష్టుఁ డెవరికిని నుపయోగపడఁడు. కాని వాఁడు తనకుఁ దానున్నంత క్రూరముగా నితరుల కుండఁడు.

భాగ్యము గల్గియుండుటకుఁ బాటుపడుము. ఔదార్యముతో దానిని వ్యయపఱుపుము.

ఇతరులకుఁ దాను సౌఖ్యము కలుగఁజేయునప్పుడు కాంచునంత సౌఖ్యమును మనుష్యుఁ డిఁకనెప్పుడును గాంచఁ జాలఁడు.

౨. మి తి మీ ఱు ట

ధనమును గూడఁబెట్టుటకంటె నెక్కువ తప్పిద మేమనఁగా దానిని బనికిమాలిన పనులకు వెచ్చపెట్టుట.

తన యావశ్యకములకుఁబైగా విచ్చలవిడిగా ధనమును వెచ్చపెట్టువాఁడు పేదవాని కర్హమయిన యధికారము నపహరించినవాఁ డగును.

దుర్వ్యయముచేయువాఁడు సత్కార్యములఁ బ్రతిషేధించును, సుగుణా

ర్జనము నాతఁడు కావింపఁడు. సుగుణములవలని బహుమానము మానవుని సౌఖ్యమే.

ధనియై మంచిగా నుండుట, దరిద్రుఁడై మంచిగానుండుట కంటెఁ జాలఁ గష్టసాధ్యము. ఐశ్వర్య మున్నప్పటికంటె దారిద్ర్యమున్నప్పుడే మనుష్యుఁడు తన్నుఁదాను జక్కఁగా నియమించుకోఁ గలఁడు.

దరిద్రుఁడు మంచితనముఁ బొందుట కొక సుగుణ మావశ్యకము. అది యోరిమి. ఔదార్యము, పరిమితత్త్వము, వివేకము మొదలయిన సుగుణములు లేకుండు ధనికుఁడు పాపిష్ఠుఁడు.

బీదవాఁడు తన భద్రమునే చూచికొనవలసియున్నాఁడు. వేనవేలు ప్రజలభద్రమును భాగ్యవంతుఁడు చూడవలసియున్నాఁడు.

వివేకముతో ధనము నిచ్చివేయువాఁడు తన బాధలఁ గూడ నిచ్చి వేయును. ధనమును దాఁచుకొని వృద్ధిచేయువాఁడు బాధలనుగూడ వృద్ధిచేసికొనును.

అతిథి దేనినేని కోరిన నది లే దనకుము. నీకుఁ గావలసినదే యగుఁ గాక! నీసోదరులవంటివారు కోరుదురేని యీయ ననఁగూడదు.

అప్రయోజనముగా లక్షలకొలఁది ధనము నింటిలో నణఁచియుంచు కొనుటకంటె దానిని సత్పాత్ర దానమున వినియోగించుటయం దెక్కువ యానందమున్న దని యెఱుఁగుము.

## ౩. ప్ర త్య ప కా ర చిం త

ప్రత్యపకారచింత మనోదౌర్బల్యమున వేరూని యున్నది. నీచవృత్తి గలవాండ్రు పిఱికివాండ్రు దీనికిఁ జాల నలవాటు పడియుందురు.

గర్హింపఁదగినవారిని గష్టపెట్టువాండ్రు పిఱికివాండ్రు గాక మఱెవ్వరు? దొంగతికము చేయువాండ్రను జంపువారు స్త్రీలుగాక మఱెవ్వరు?

ప్రత్యపకారము చేయుటకుఁ బూర్వమేదైన నపకారబాధ నందియుండవలయునుగదా! ఉన్నతులగువారి కపకారము దమ్ము బాధించుచున్నదని యెన్నుటే యసహ్యమగును అపకారబాధను నీ వలక్ష్యము చేయఁజాలక పోవుటవలన నాబాధను నీకుఁ గలిగించినవాఁడు తనకుఁ దా నపకార బాధను గలిగించుకొన్నవాఁ డగును. నీచునితో నీవును సమానముగాఁ గ్రుద్దులాడఁ జూచెదవా?

నీకుఁ జెడుగు చేయనెంచిన వానిని దృణీకరింపుము. నీకుఁ జీకాకు గలిగింపఁ జూచువానిని సరకుగొనకుము.

ఇట్లు చేయుటవలన నీ శాంతిని నీవు కాపాడుకొనుటయే కాక ప్రత్యపకార నైచ్యమునకుఁ బాల్పడకయే యా యపకారిని బ్రత్యపకారశిక్షకుఁ బాల్పఱుపఁ గల్గుదువు.

తుపానులు, పిడుగులు, మేలితావునమన్న సూర్యుని. నక్షత్రములను నేమియుఁ జేయఁజాలకకీళ్ళట్టుననున్న చెట్టులను గుట్టలనుగూల్చునట్టుగా

నపకారము లున్నతాత్ముల నందఁజాలక యవి గలిగించు నీచులనే నపయింపును. అధీరత ప్రత్యపకారచింతను బ్రేరేచును. ఉదారహృదయత యపకారమును దృణీకరించుటేకాక యది చేసిన వాని యాత్మకు మేలునుగూడఁ గూర్చును.

మనుష్యుఁడా! ప్రత్యపకారముచేయ నేలకోరెదవు? దానిచే నీ విరోధిని గష్టపఱుపఁదలఁచెదవా? నీవే కష్టపడుదువని యెఱుఁగుమోయి?

ప్రత్యపకారచింత యదికలవాని హృదయమును దునుకలు దునుకలుగాఁ గొఱికివైచును. ప్రత్యపకార మెవనికిఁ జేయఁబడునో వాఁ డందుచే సుఖమందును.

తాను గలిగించుబాధ యాతని కధికమై యన్యాయ్యముగా నున్నది. కాఁబట్టి ప్రత్యపకారము తాను జేయవలసినది గాదు మొదటనే గాయము తగిలినవాని కింకొక బాధ యెక్కువయెందుకు? అదియుఁగాక మఱియొకఁడు తనకుఁ గలిగించినబాధ యుండఁగా దానింకను దాని కాధిక్యము గల్పించుకొనవలెనా?

ప్రత్యపకారము చేయువాఁడు తనకుఁ గలిగిన యపకారబాధతో నడఁగి యుండక యింకను నాతఁ డితరుని శిక్షనుగూడఁ బైవైచుకొనును.

ఎవనికిఁదాను బాధగలిగింపఁగోరునో వాఁడు నవ్వుచుఁబోవును. ఆన వ్వెందుకనఁగా నాబాధ గలిగింపఁ గోరినవాఁడు తన దుర్దశను బలపఱచుకొన్నాఁడు గదాయని.

ప్రత్యపకారచింత మిక్కిలి పాపిష్ఠమైనది. అది మిక్కిలి యపాయకరము. సాధారణముగా నెక్కడవేయ నుద్దేశించునో యక్కడ గొడ్డలి వ్రేటుపడదు. ఒకవేళ నది యెదురుదిరిగి తనమీఁదికే రావచ్చును.

అపకారికిఁ బ్రత్యపకారమొనర్చి బాధ గలిగింపవలయు ననుకొను వాఁడు తప్పకుండ దనకే నాశము తెచ్చుకొనును. పగవాని కన్నొకటి పోఁగొట్టఁ జూచువాఁడు తన రెండుగన్నులను బోఁగొట్టుకొనువాఁడగును.

తాను జేయఁబూనిన ప్రత్యపకారము జరుగకపోయినచో దుఃఖము కలుగును. జరిగినచో దానికి బదులు కలిగి పశ్చాత్తాప మేర్పడును.

న్యాయమువలని భయము వాని యాత్మశాంతిని జెఱుచును. అన్యాయము నగపడనీయక వానిని న్యాయమున నిలువరింప వలయు ననెడి కలవరము వానిస్నేహితుని న్యాయమును జెఱచును.

నీవిరోధి చావు నీకోపమును జల్లార్చునా ? అతనికి జావు గలిగించి శాంతి గలిగించితివి. అది నీకు శాంతిని గలిగింపఁ గలదా ?

దుష్కార్యము చేసినవానికి సంతాపము గలిగించువిధమే దనఁగా వానిని జయించి చంపకుండ విడుచుట. చంపితివా నీయుత్కృష్టత నాతఁ డూహింపఁజాలఁడు. అహోయనఁజాలఁడు. మఱియు నీకోపము బలమును గనుఁగొనఁ జాలఁడు.

ప్రత్యపకారమువలనఁ బ్రత్యపకారికి జయముండవలయును గదా! ఆతని కపకారమొనర్చిన వాఁడు తన యకృత్యపు బరువు నెఱుఁగవలయును. ఎఱిఁగి యట్లొనర్చినందులకు గ్రుళ్లి కుమిలి పశ్చాత్తాపపడవలయును. ప్రత్యపకార చింత కోపముననుండి పుట్టుచున్నది. దానిని దృణీకరించుటవలననే జయముకల్గును.

తప్పుచేసినందులకై యొకనిని జంపవలయుననెడి బుద్ధి పిఱికితనమువలనఁ బుట్టును. బ్రతికియున్నచోఁ దన్ను బాధింపఁ గలఁడని భయముఁ జెంది శత్రువు నాతఁడు చంపును.

చావు తగవును జల్లార్చును గాని కీర్తిలతను మరల మొలవకుండఁ ద్రుంచివైచును. చంపుట ధైర్యస్థైర్యములు గలవాని పనికాదు. దానివలన న్యాయము నాశమగును.

అపకారమునకుఁ బ్రత్యపకారము చేయుటంత లఘువయినదేదియులేదు. కాని దాని మన్నించుటంతఘనమయి నదియు వేఱొకటిలేదు.

మనుజునకు గొప్పజయ మేదనఁ దనను దాను జయించుటే. తనకు జరిగిన యపకారము నపకారముగా నెంచక తృణీకరించువాఁ డాయపకారమును జరిపినవానికే మరలఁ ద్రిప్పిపుచ్చినవాఁ డగును.

ప్రత్యపకారము చేయుటకయి యాలోచించునపు డా యపకారము నీ మనస్సునకు వ్యధకల్గించిన దనుటలో నీకు నీవే సాక్షివయ్యెదవు.

దానిఁగూర్చి పలవించి నాకు బాధకలిగిన దని నీకు నీవే యొప్పఁ జెప్పుకొనెదవు. నీవిరోధిగర్వమున కిట్లు విజయోత్సాహమునుగూడఁ గూర్పనెంచెదవా ?

మనస్సు నొవ్వకున్నచో నది యపకారముగాదు. అపకారమును ద్రృణీక రించువాఁడు ప్రత్యపకార మేలచేయవలెను ! నిందమోచుట నీ కవమా నము గూర్చు ననుకొనెదవేని నీశక్తి యంతకింక నధికముగా నున్నది సుమా! కాన దానిని నీవు జయింపఁగలవు.

మంచితలంపులుగలిగి పరులకు మంచిపనిఁజేయఁ జూచుచుందువేని నీ కెవ్వరును విరోధము చేయరు. అట్లు చేయుట యవమానకరముగాఁ దలఁతురు నీయాత్మోన్నత్యము వారినపకారము చేయకుండఁ జేయును.

త ప్పెంత గొప్పదగునో దాని మన్నించుటయు నంతగొప్పదగును. ప్రత్యపకార మొనర్చుటయం దెంత న్యాయమున్నదో క్షమించుటయం దంతఘనత యున్నది.

నీవిషయమున న్యాయనిర్ణాయకుఁడుగా నుండుటకు నీ కధికారము గలదా? వివాదమం దభినివిష్టుఁడగువాఁడు తానెట్లు ధర్మనిర్ణేత కాఁగలఁడు ?

ప్రత్యపకార బుద్ధిగలవానిని జూచి యందఱును భయపడుదురు. అందు వలన నాతఁ డందఱకు నసహ్యుఁడగును. అపకారసహనము గలవానిఁ జూచి యందఱు నానందింతురు. అందువలన నాతఁ డందఱకుఁ బ్రేమ

పాత్ర మగును. ఆతని కీర్తి శాశ్వతముగ నుండును. ప్రపంచప్రేమ యాతని వెంబడించును.

౪. క్రూ ర త్వ ము, ఏ వ గిం పు, అ సూ య

ప్రత్యపకారచింత యసహ్యమయినది యని యెఱింగితిమి. ఇఁకఁ క్రౌర్యమనునది యెట్టిదనఁగా నది ప్రత్యపకారచింతకుండు చెట్టఱికము నెల్లఁ జెందియుండుటే కాక పరునికిఁ గోపము గలిగించు తీరుగూడఁ గూడియున్నది.

మనుష్యులు తమ స్వభావమున నదీ లేదందురు. అది తమహృదయములకొక క్రొత్తదైనట్టు గూడ దానిఁ గూర్చి సిగ్గిలుదురు. మనుష్యుల కది తగినగుణము కాదని కూడ వా రందురు.

ఇఁక నది యేలమండి యేర్పడుచున్నది? మనుష్యసంబంధము గలది యేది దానికి జననకారణము? భయముదాని తండ్రి; నివ్వెఱ దానితల్లి.

వీరుఁడు తన్నెదిరించు విరోధిపయిఁ గత్తియెత్తును. కాని యావిరోధి లోపడెనేని తృప్తిచెందును.

భయపడువాని నణఁగఁద్రొక్కుట బాగుకాదు. తనకుఁ దక్కువగ నుండువానిని నిందించుట సౌశీల్యము గాదుఁ గర్వితులై నిన్నుఁ దృణీకరించువారిని లొంగఁదీసి కొనుము. యోగ్యులు విధేయులు నగువారిని మన్నింపుము. అట్లుచేసితివా అతిశయితమైన జయము

నందుదువు. ఇట్లు జయమందఁదగిన శక్తి లేనివాఁడు, సౌశీల్యముతో వాని సాధింపఁజాలనివాఁడు, ఎదిరి వానిని లొంగఁదీసికొని యేలుటకు బదులు వానిని జంపును.

పరులనుజూచి భయపడువాఁడు పరులను గొట్టఁబ్రయత్నించును. భయమునఁ గొట్టుకొనుచుందురు గావుననే క్రూరప్రభువులు చండశాసనులయి దండనీతితో నుందురు.

బ్రదికియున్నప్పుడు జంతువు ముఖమునుగూడఁ బరికింప జాలదుగాని యూరఁగుక్క, ప్రాణము పోయిన పిదప దానిబడుగుదేహమును వ్రచ్చివైచును. బ్రదికియున్నంతదాఁక జంతువుఁ బైబడి తఱిమి వేఁటాడును గాని వేఁటకుక్క, ప్రాణముపోయినపిదప దానిని మూ చూడనేని చూడదు.

దేశమున జరుగు ప్రజాయుద్ధములు మిక్కిలి బీభత్సమయినవి. ఏలనఁగా నందు యుద్ధముచేయువారు దురాలోచన పరులగు పిఱికిపందలు. వారు తమ చేయుహింసవలనఁ దమ దౌష్ట్యము బయలుపడకుండునని తలఁతురు. మారణము వలనఁ దప్పిదము మాసిపోవునని వారితలఁపు.

క్రౌర్యముతో నుండకుండుటకు నిన్ను నీవ నిర్లక్ష్యముపై నెలకొల్పుకొమ్ము. ఈర్ష్యను నీవరికిఁ జేరనీయకుము.

ఇతరుని నీవిరుదెఱఁగులఁ జూడవచ్చును. అతఁడు నాకధికోపద్రవకారి యని చూచుట యొకతెఱఁగు. అల్పోపద్రవకారియే యని చూచుట

వేఱొకతెఱఁగు. అన్యుఁడు నా కల్పోపద్రవకారియే కాఁగలఁ డన్న తెఱఁగున నీవు సూచితివేని వేనికిని నీవు చెఱుపు సేయవు.

మానవుఁడు తన శ్రేయమునకు మార్చుకొనఁజాలని దేమున్నది? తన్నుబాధించు వానిని గర్హించుటకంటెఁ దనబాధనుగూర్చి వానికి విన్న వించుటలో మేలున్నది. తానెవరి నభ్యర్థించునో వారు దానితో సమాధానపడుదురు. తా నెవనిఁగూర్చి యేవగింపుచెందునో వాఁడు వాని ప్రాణమును దీయును.

నీలాభము నెవఁడేని చెడఁగొట్టినచో నీవు వానిపైఁ గోపగింపకుము. ఆట్లుకోపగించి మనశ్శాంతిని గోల్పోవుట యా లాభపుఁ గోల్పోక కంటె నెక్కువగా శోచనీయమయినది.

ఉత్తరీయ మెత్తుకొని పోఁబడె నని యంతరీయమునుగూడ నవతలఁ బాఱవైతువా ?

సమ్మానములు, బిరుదులు, పెండెములు సంపాదించుకొన్న వానిఁ జూచి నీ వీర్ష్యచెందినపుడు,వానిగౌరవనామధేయములును ఘనతయును నీకుఁ గోపముకలిగించి నపుడు అవి యాతని కెక్కడనుండి వచ్చెనో యెఱిఁగి కొనుము. ఏయేమార్గముల వాని నాతఁ డార్జించెనో యెఱిఁగి కొనుము. అప్పుడు నీకుఁ గలిగినయీర్ష్యయుఁ గోపమును గనికరముగ మాఱఁగలవు.

ఆ ధరకే నీ కా భాగ్యము లభింప నుండినప్పుడు నీవు తెలివిగలిగిన వాఁడ వగుదువేని దానిని నిరసింతువు.

బిరుదుపెండెరములకు సాధకమయినది ముఖస్తుతియే. అధికారము నిచ్చువానికి దాసుఁడుగా నుండనివాఁ డధికారమును గొనఁజాలఁడు.

ఇతరుల స్వాతంత్త్ర్యమును జేత నుంచుకొనుటకయి నీ స్వాతంత్త్ర్యమును గోల్పోవుదువా? అట్లెవ్వఁడేని చేయునేని వానిని జూచి నీ వసూయ చెందవచ్చునా? ఎవఁడు గాని వెల యీయకుండఁ బయివారిదగ్గఱ నుండి దేనినేని విలువఁజాలఁడు. ఆ యిచ్చెడువెల వాఁడు కొనఁదలఁచిన వస్తువు చేయు విలువకంటె హెచ్చుగావచ్చునా? లోకాచారమును నీవు మార్పఁజాలవు. విలువట నీకు దక్కుచో వెలకూడ నీకు దక్కఁ జాలదుగదా!

ఈప్సితము గానివిషయమునుగూర్చి నీ వీర్ష్య చెందఁ జాలవు. కావున నీ కీర్ష్యనుగలిగించునది యీప్సితత్వము. ఈర్ష్యాకారణమగు నీయీప్సితత్వమును దృణీకరింపుము. నీకు గౌరవముండినచో గౌరవహాని గలిగించువస్తువును నీవు చెంద నెంచెదవా? సౌశీల్యపువిలువ నీకుఁ దెలిసినచో నీచముగా నాసౌశీల్యమును విక్రయించినవానినిజూచి నీవు కనికరమును జెందవా?

పరులక్షేమాభాసమును నీవు పరితపింపకుండ విని యోర్వఁగల్గియుందువేని వారివాస్తవక్షేమమును సంతోషముతోఁ బ్రస్తుతింపఁగల్గుదువు.

కలుగవలసినవారికి మేలు కలిగెనేని నీవు సంతోషింపుము. సుశీలుఁ డెప్పుడును సుశీలతగలవాని మేలును జూచి సుఖమందును.

ఇతరులకుఁ గలుగుసుఖమును జూచి సంతోషించువారు తమ సుఖమును వృద్ధిపఱుచుకొనువా రగుచున్నారు.

౫. హృదయోద్వేగము

ఉల్లాసముతో నుండువానిహృదయము దుఃఖముఖమునఁ జిఱునగవును దొంగలింపఁజేయును. ఉసూరుమనుచుండు వాని నిరాశయు నధైర్యమును సుఖముఖమున నుండుశోభను శూన్యపఱుచును.

ఆత్మదౌర్బల్యమే దుఃఖమునకు మూలము. నిరుత్సాహమే దుఃఖమునకు బలము నిచ్చునది. గంభ్రతనమునకు నీవు కడంగుము. అట్లు కడంగుట కింకను ముందే హృదయోద్వేగము నిన్ను వదలిపోఁగలదు.

ఆహృదయోద్వేగము నీజాతికంతకుఁ జెడుపు దెచ్చును. కావున దాని నీ హృదయమునఁ జేరనీయకుము. అది యుండెనా నీజీవితమం దమృత మధురము లగువిషయములెల్ల విషదిగ్ధములై చేఁదువాఱును.

అది కానువోయినంత నష్టమునుగూడ సౌభాగ్యమెల్లఁ బాఁడయినంత నష్టమునుగా నీకుఁజూపును. అక్కఱ లేని యల్పవిషయములం దది నీ కత్యంతవిచారముఁ గలిగించి ఆవశ్యకము లయిన యధిక విషయములం దాలోచనమే పోకుండఁ జేయును.

నీ మంచిగుణములకది మైకముఁ గ్రమ్మించును. ఇతరులు చూచి గౌరవింతురని వాని నది మఱుగుపఱుచును. సద్గుణములను నీవు ప్రకటింపవలసినసమయములందు వానిని జిక్కఁబట్టి యణఁగఁ ద్రొక్కును.

ఇట్లది మంచిగుణములను మాటుపఱిచి చెడుగుణములను జేకూర్చి మనుజుని బాధించును. తనపైనుండి భారమును దొలఁగఁద్రోసికొన వలసినసమయమున నది వాని రెండుచేతులను గట్టివైచును.

నీచత్వమును, పిఱికితనమును, అధర్మమును, నీవు తొలఁగఁ ద్రోసికొనఁ గోరుదువేని హృదయోద్వేగము నిన్ను ముట్టకుండఁ జూచుకొమ్ము.

దానిని భక్తివేషము వేయనీయకుము. మఱియుఁ దత్త్వజ్ఞానము రీతిగాఁ దోఁచి నిన్ను మోసపుచ్చకుండఁ గూడఁజూడుము. తత్త్వజ్ఞానము భగవంతుని గౌరవించును. ఈశ్వరచింతనమును హృదయోద్వేగముచే మఱుఁగుపడనీయకుము. ఈశ్వరచింతనము నీకు సుఖమును గూర్చును. దానికి దుఃఖ మనునది యపరిచితము.

ఆపదవలనఁ గాక మానవుఁడు మఱి దేనివలన దుఃఖియగును? సంతోషకారణములు తనదగ్గఱ నుండినప్పుడుగూడా మానవుని హృదయ మేల సంతోషమును గోల్పోవలెను? దౌర్భాగ్యము కోసమా యాకోల్పోవుట!

వాస్తవముగా వ్యథనుగలిగించు కారణమునఁగాక, మనసు చిన్నఁ బోయిన మాత్రమున నుద్వేగము నందువాఁడు, కన్నీరుగార్చుటకై ధనముగొని శవమువెంటఁ జనుచు దుఃఖించువానివంటివాఁడు.

దుఃఖమును బుట్టించునది సమయముగాదు; సందర్భముగాదు. ఏల నఁగా నొకసమయమే యొకసందర్భమే యొకనికి దుఃఖమును వేఱొక నికి వేడుకను గూర్పఁగల్గును.

జరుగనున్న కార్యములను సంతాపవిచారములచే నెక్కువగాఁ జక్క పఱుపఁగల్గుచుంటిరా యని యితరుల నెవ్వరినైన నడిగిచూడుము. లేదు. అఁట్లెన్నటికిని సాధ్యము కాదని వారందురు.

సహనముతోఁ గష్టముల ననుభవించి ధైర్యముతో దురదృష్టము నెదుర్కొనువానినిఁ బ్రజలు శ్లాఘింతురు.

ప్రకృతిసంవిధానములను వ్యాకులత చీకాకుపాలు పఱుచును. కావున వ్యాకులత ప్రకృతికి విరుద్ధ మయినది. ప్రకృతి ప్రియముగా నుండు నట్లు కల్పించిన విషయముల నెల్ల వ్యాకులత నీరసములనుగాను రుచి లేని వానిఁగాను జేయును.

చేకుఱ్ఱమాఁకులు తుపానుతాఁకున నేలకుఱ్ఱవాలి మఱల లేవ జాలనట్లు మానవహృదయములు సంతాపోద్వేగముల సోఁకునఁ జదియఁబడి మఱలఁ బూర్వౌన్నత్యమును బొందఁజాలవు.

పర్వతముపయి వాన గురిసినప్పుడు నెలయేళ్లు క్రిందికి జాఱుచు నక్కడి మంచుసంచునెల్లఁ గ్రిందికిఁ గొట్టుకొని పోఁగొట్టునట్లు మనుష్యుఁడు సంతాపోద్వేగములపాలయి నప్పుడు కన్నీళ్లజాళ్లు చెంపల నుండి కాఱుచు ముఖవికాసమును దుడిచిపెట్టి తొలఁగఁ గొట్టును. పర్వతమున కామంచుగాని ముఖమున కావికాసముగాని మఱల మును పటివలె వఱలదు.

బాహిరపుఁబట్టులందులి సంతాపచింతలను జూడుము. పలువురు గుమి గూడుపట్టులఁ జూపట్టు నుద్వేగములఁజూడుము.

ఎవరైన నందుఁ దవుల్కొనువా రుందురా ? వారి నందఱను దప్పించు కొని యాసంతాపచింతలు సాగుచుండుట లేదా ? సంతాపచింతావశుల సమీపింపక యందఱును నావలీవలగా నరుగుచుండుట లేదా ?

సంతాపచింతావశులు తొడిమ త్రుంచిన పువ్వులవలెఁ దలల వాల్చి వాడు వాఱి యుందురు. చూడుము. మొగమెత్తక వారు నేలవంకనే చూచు చుందురు. ఏడ్పునకుఁ దప్ప వారి కన్ను లింకెందుకుఁ బనిగొనవు.

అట్టివారికి నోట మాట యుండదు. హృదయమున నలువురతోఁ గలసి మెలసి యుండుటకుఁ జెలికారము మొలకెత్తదు. బుద్ధియందు వివేకము పొడమదు. వారిని గారణ మడుగుము.కారణమేమో వారికిఁ దెలియదు. సందర్భము తెలుపుఁ డనుము. అరయఁగా వారికి సందర్భ మేమియు నగపడదు.

అయినను వారి దేహమనోబలములు వారిని వీడిపోవుచున్నవి. కడకు వా రడఁగారుచున్నారు. అడఁగారినపిదప నెవ్వరుగాని "వా రేమై" రని వారినిగూర్చి విచారింపరు.

వివేకముగలిగియు నీవు దీనిని దెలిసికొనవా ? ప్రపన్నుఁడ వయియు నీవు నీప్రమాదమును గనుఁగొనవా ?

భగవంతుఁడు నిన్నుఁ గరుణతో సృష్టించెను. నీవు సుఖపడవలయునని తలఁపఁడేని భగవంతుఁడు నిన్ను సృష్టించియే యుండఁడు. కరుణా ఘుఁడైన యా భగవంతుఁడు నిన్నుఁ గటాక్షించుచుండఁగనే నీవు కడముట్టఁజూతువా ?

ఉద్వేగము నొందక శాంతముతో సంతోషముతోఁ జీవితము సాగించు టచే నీ వీశ్వరుని సత్కరించినవాఁడ వగుదువు. నీ వసంతుష్టుఁడవై యుండు టనఁగా మహనీయుఁడయిన భగవంతునిపై మటమట లాడుట గాక మఱేమి ?

ప్రతిపదార్థమును బరిణామముఁ బొందునట్లుగదా భగవంతుఁడు సృష్టించెను! పదార్థములు పరిణామ మందుచుండ నీ వేల పరితాప మందవలెను !

ప్రకృతి ధర్మము నెఱుఁగుదుమేని మన మాపరిణామమును గూర్చి పరితాపపడరాదు. దాని మన మెఱుఁగకపోవుదుమేని ప్రతిక్షణమును

ప్రవ్యక్త మగుచుండు మన ప్రగుడ్డితనమును గూర్చియే కదా మనము కోపించుకొనవలసినది.

లోకమున కెల్ల న్యాయనిర్ణయముచేయుట నీపనిగా దని యెఱుగుము. నిర్ణీతములైన న్యాయములకు లోఁగియుండుటే నీపని. ఇదియెఱుఁగుము. అవి నీకుఁ గష్టమును గలిగించినప్పుడు నీవు గగ్గోలుపడితివా కలిగినకష్టము పెక్కుమడుఁగు లెక్కు వగును.

కపటనటనల కెప్పుడును మోసపోకుము. దుఃఖము దుర్దశను దొలఁగించునని తలంపకుము. అదియౌషధమువలె నగపడు విషము. నీకొమ్మపై నాఁటిన యమ్మును దొలఁగించునదివోలెఁ దోఁచునుగాని వాస్తవమున కాయమ్మును నీగుండెలలోనికి గ్రుచ్చును.

చింతాసంతాపములు చెలికాండ్రలోనుండి నిన్ను విడఁగొట్టినప్పుడు నీవు సల్లాపార్హుఁడవు గావని చాటుట కాలేదా ? మనఃక్షోభము నిన్ను మాఱుమూలల దాఁచి యుంచునప్పు డది తానుచేయుపని తనకే యవమానకరమని తెలియఁజేయుట కాలేదా ?

దురదృష్టము లనెడు శరపాతములకుఁ దొలఁగి మెలఁగుట నీశక్యము కాదు. వివేకము నిన్నటుచేయఁ గోరదు. ధీరతతో దురదృష్టపు దెబ్బలకు నిబ్బరించి నిలుచుటే పురుషధర్మము. క్రీరతతోనే తొలుత దానిని దెలిసికొని యెదుర్కొనవలెను.

నీహృదయమున సౌమనస్యము సాగుచున్నసుగూడ నీకన్నులనుండి

నీరుగా నవచ్చును. కాని యట్లు గన్నీరు గారుటకుఁ దగ్గ కారణ ముండుటమాత్రము చూచు కొనుము. అయశ్రుపాతమును గూడ నధికము గానీకుము.

ఆపదలయాధిక్యము వానికై నీవు నించు కన్నీటిసంచుచే గణింపఁబడదు. గొప్పసంతోషములను ముఖవికాసములు గోచరింపఁ జేయఁజాలనట్లే గొప్పదుఃఖములను గన్నీటి బొట్లు కన్పఱుపఁజాలవు.

దుఃఖమునకంటె నాత్మను దుర్బలపఱుచునది మఱియే మున్నది? సంతాపమువలె హృదయమును జదియఁగొట్టునది మఱియేమున్నది? క్షుభితహృదయుఁడు గణనీయములయిన ఘనకార్యములను జేయఁగడంగఁగలఁడా? సౌమనస్యమును సంరక్షించుకొనుటకు శక్తుఁడు కాఁగలఁడా?

సత్ప్రతిఫలము లేదేని సంకటమునకుఁ బాలుపడకుము. మేలునకు సాధనములగువానిని జెడుగునకై యుపయోగించి చెఱచుకొనకుము.



# నీతినిధి

## చతుర్థాధ్యాయము

# మనుజుఁడు తోడివారి వీఁటి పొందఁదగిన దొడ్డగుణములు

### ౧. ఘనత, గౌరవము

ఘనతయు గౌరవమును నాత్మ నంటియుండునుగాని యాకారభాషాదుల నంటియుండవు. సత్స్వభావమందే సత్యమైన గౌరవము గానవగును.

చెడ్డపనులుచేసి ప్రభు సమ్మానముఁ బడయవచ్చును. బిరుదు పెండెములను బదవులను ధన మిచ్చి కొనవచ్చును. కాని వీనిచే యథార్థమయిన గౌరవమేర్పడదు. దుష్కార్యములుచేయువాని నున్నత దశకుఁ దేఁజాలవు. బంగారము మానవులకు గౌరవముఁ గల్పింపఁజాలదు.

బిరుదులు సౌశీల్యమునకుఁ జేయు సత్కారము లయినప్పుడును దేశ సేవకు లున్నతస్థితికిఁ దేఁబడునప్పుడును, బిరుదుపెండెముల నొసఁగువాఁడు వానిని గొనువానివలె వార్త కెక్కఁగలఁడు. తన్మూలమున లోకమునకు మేలు చేకూడఁగలదు. "ఈతని కిది యేతీరున వచ్చిన" దని యెవ్వరును విచారింప నక్కఱలేనివిధమున ఘనతఁ గాంచఁ

జూతువా? లేక "యాతని కిది యెట్లు వచ్చిన" దని యందఱు నడుగ వలసినట్లు ఘనత గడింపఁజూతువా ?

వీరపురుషులగుణములు వారిసంతానమునకుఁ గూడ సమకూడె నేని వారు తమ తండ్రులు గడించిన గౌరవసత్కారములు గాంచఁదగుదురు. అట్టి గుణవిశేషములు సమకూడనివా రాపేరుపెంపులను బెట్టుకొందురేని లోకులు వారిని "అధోగతి నున్నవా" రని యనుకొనరా?

తరతరములనుండి వచ్చు గౌరవమే గొప్పగౌరవ మని కొందఱందురు. కాని వివేచన చేసి చూడఁగాఁ గష్టపడి సంపాదించినగౌరవమే వాస్తవ మయిన గౌరవ మని చెప్పనొప్పను.

స్వయము యోగ్యత లేనివాఁడయియును దాతముత్తాతల ఘనతను జెప్పు కొని తానును ఘనత నందఁజూచు వాఁడు,స్వయము దొంగయయియును దేవాలయమునఁ జొచ్చి పవిత్రులతోపాటుగాఁ దానును బవిత్రత్వమును బ్రకటించుకొనఁ జూచువాని వంటివాఁడు.

తనతల్లిదండ్రులు కన్నులుగల్గి చూడఁగలవారై యున్నచో నందువలన నంధున కేమిలాభముండును? తనతాత వాగ్ధాటిగలవాఁడయినచో నందు వలన మూఁగవాని కేమి లాభముండును ? తమ పౌర్వికులు మహ నీయులయి యుండినను నందువలన నధము లేమియు లాభ మందఁ జాలరు.

సౌశీల్యమే మనుజుని ఘనునిఁగాఁ జేయును. బిరుదుపెండెరములు లేకున్నను నది మనుజుని నున్నతస్థానమందుంచును.

ఆతఁడు స్వయముగా గౌరవమును సంపాదించును. ఇతరు లితరుల యొద్దనుండి కొనితెచ్చికొందురు.

వస్తువును నీడ వీడకుండునట్లు సౌశీల్యమును నిజమయిన గౌరవము సమాశ్రయించియుండును.

గౌరవము ధైర్యమునకుఁ బుట్టినబిడ్డ యని తలంపకుము. ప్రాణత్యాగమునకు సిద్ధపడుటయె గౌరవమును గొనుటకుఁ దగిన క్రయధనమని యనుకొనకుము. గౌరవము నీ వొనర్చు కార్యములను బట్టి కాదు వచ్చునది. అది నీవు తలపెట్టిన కార్యములను గావించు విధానములనుబట్టి వచ్చును.

రాజ్యనౌక కెల్లరును గర్ణధారులుఁ గాఁజాలరు. సైన్యాధిపత్యము వహింప జను లందఱు లర్హులు గాఁజాలరు. నీకు విహితమయిన కృత్యమును నీవు నిర్వక్రముగా నెఱవేర్పుము. సమ్మానితుఁడ వగుదువు.

కీర్తిగాంచుటకుఁ గష్టముల జయింపవలె నని కాని, అపాయములు నాయాసములు ననుభవింపవలె నని కాని యనుకొనకుము. పతివ్రత ప్రస్తుతి కెక్కుటఁ బరికింపుము. సుశీలుఁడు కీర్తిఁ దగుటఁ జూడుము.

యశస్తృష్ట మిక్కిలి తీవ్ర మయినది. గౌరవకాంక్ష గొప్పశక్తి గలది.

ప్రశస్తకార్యములఁ జేయుటకయి భగవంతుఁడు వీనిని మన కొసఁగినాఁడు.

లోకక్షేమమునకయి భయంకరకార్యములఁ జేయవలసి వచ్చినప్పుడును, ప్రాణములఁగూడ నర్పింపవలసి వచ్చినప్పుడును సత్కీర్తిమీఁది యత్యాశ తప్ప మనుష్యునకుఁ శక్తి నిచ్చునది మఱియేది?

ఘనగుణమునకు సంతోషమునుగూర్చునది ఖ్యాతినిగాంచుటకాదు; అట్లు ఖ్యాతిని గాంచుటకుఁ దగ్గ యర్హత తన కుండుట.

ప్రజలు "వానికేల ప్రతిమారూపమునఁ బ్రతిష్ఠ యేర్పడె" ననఁదగి నట్లుండుటకంటె "ప్రతిమారూపమున వాని కేల ప్రతిష్ఠ యేర్పడలే" దనఁదగి నట్లుండుట యుక్తముగాదా?

అత్యాశాపరుఁడే యందఱిలో ముందువాఁడుగా నుండును. వాఁడు వెనుకఁ జూడక ముందటికిఁ ద్రోసికొని పోవును. అందఱను వెనుక కుఁద్రోసిపుచ్చి వచ్చితిని గదాయని యానందించుచుండును. ఒక్కఁ డెవఁడేనితనముందటికిఁ ద్రొక్కికొని వచ్చుట వానికెక్కువగా సంతాపమును గూర్చును.

ఆశాంకురములు ప్రతి హృదయము నంటియుండును. కాని యవి యందఱియందును బెంపొందవు. పలువురలోనవి భయముచే మూసి పెట్టఁబడి యుండును. కొందఱిలోనవి యణఁకువచే నణఁచివేయఁబడి యుండును.

ఆశయనునది యాత్మ కంతరంగపుటుడుపు. దేహమునఁ బ్రవేశించు నపుడది దాని ధరించును. తాను దేహమును వీడునపుడు దానినిగూడ వీడును.

సత్కార్యములందు దాని నుపయోగించితివా నీకదిసద్యశము గల్గించును. దుష్కార్యములం దుపయోగించితివా నిన్నది దూషించి నాశపఱుచును.

విశ్వాసఘాతుకునిహృదయమున నత్యాశ దాఁగియుండును. దానిచాటునఁ గాపట్యమొకటి తలదాఁచుకొని యుండును. అత్యాశ కది మృదువాక్యముల నప్పును. ఈక్రుళ్ల కొన్నాళ్లకు వెల్లడికాక మానదు. లోకు లిదియెల్లఁ దెలిసికొందురు.

చలిచేఁ దిమ్మిరియెక్కి కొయ్యవాఱి యున్నను సర్పము తనవిషయమును వీడదు. చలిచే నోరు బిగిసిపోయినను గూడ పాముకోరలు పగిలిపోవు. దయఁదాల్చి నీవు దానిని రక్షించితివా తనసద్గుణము నది కనుపఱుచును. వలిగొన్న దానికిఁ జలిమంట దరికొల్పి యసురు నిల్పినప్పు డది ప్రత్యుపకారమో యనునట్లు కాటువేసి నిన్నుఁ గడ తేర్చును.

సచ్చరిత్రుఁడు సౌశీల్యమును సౌశీల్యముకోసమే ప్రేమించును. అత్యాశకోరెడు సమ్మానము నాతఁడు తృణీకరించును.

ఇతరులు స్తుతించినఁగాని పరితోషము పడయఁజాలని ఘనచరిత్రుని స్థితి యెంతయుఁ గనికరింపఁదగినది గదా! ఘనవర్తనము ప్రతిఫలము

కాంక్షించునదిగా నుండ రాదు. ఆదరముకంటె నది యధికము కరాదు.

అభ్యుదయ మందుచున్నకాలఁదిని సూర్యునికి నీడ యల్పమగు చుండును. అట్లే సౌశీల్యమెక్కువగుచున్న క్రొలఁదిని శ్లాఘాపేక్ష దానికిఁ దక్కువగుచుండును.

తన్నుఁ బట్టుకొనవలెనని తంటాలుపడుచుఁ బరుగువాఱు వానికిఁ గీర్తి నీడవలెఁ నందిరాక దూర మరుగుచుండును. కాని నా కీకీర్తి యక్కఱ లేదని ప్రక్కఁగాఁ జనఁజూచు వాని నది వెంటాడి యంటుకొనును. అనర్హుఁడు కీర్తికై యాయాసపడినను నది యబ్బదు. అర్హుఁడు తన కది యబ్బకుండుటకై దాఁగియున్నను నబ్బకమానదు.

సత్పురుషుల వెంబడింపుము. సత్కార్యములఁ జేయుము. అర్హతానర్హతల నెఱుఁగక పొగడుచుండు ననేకులకంటె నీనడవడినిగూర్చి నీ యాత్మవిశ్వాసమే నీ కెక్కువగా ముదముఁ గూర్పఁగలది.

౨. శా స్త్ర ము లు, పాం డి త్య ము

భగవంతునిచే సృష్టింపఁబడినపదార్థములను బరీక్షించి తెలిసికొనుటయే మనస్సునకు ఘనతరమయిన యుద్యోగము.

ప్రకృతిపరిశీలన మెవనికిఁ బరితోషముఁగూర్చునో వానికిఁ బ్రతిపదార్థము భగవంతునియస్తిత్వమును నిరూపించును. అట్లాయస్తిత్వమును

నిరూపణచేయు నఖిలార్థములును భగవదారాధనాసక్తికిఁ బ్రయోజకము లగును.

ప్రతినిమిషము నట్టివాని మనసు భగవంతునిమీఁదనే యుండును. జీవిత మున్నంతదాఁక నాతఁడు భక్తిరసమున నోలలాడుచుండును.

కన్నులు పైకెత్తినప్పు డాతని కంతరిక్షమెల్ల నద్భుతములతో నిండి యుండినట్టు కనుపట్టదా ? భూమివంకఁ జూచినప్పు డాతనికిఁ జిన్ని పురుగుగూడ భగవంతుఁడు దక్కఁ దక్కొరుఁడు తన్ను సృష్టింపఁ జాలఁడని నొక్కి వక్కాణింపదా?

గ్రహములు తమతమకక్ష్యలలోఁ దీరుదప్పక తిరుగుచున్నవి. నిశ్చలుఁడుగాఁ దనస్థానమున సూర్యుఁడు నిలిచియున్నాఁడు. తోఁకచుక్కలు మహాకాశమునఁ దమత్రోవను జనుచున్నవి. ఓయినరుఁడా ! భగవంతుఁడు గాక వానికిట్లు పనిగొల్పినవాఁడు మఱెవ్వఁడు కాఁగలఁడు? అపారమయిన విజ్ఞానముగలవాఁడుగదా వాని నిట్లను శాసింపఁగలవాఁడు కాఁగల్గును !

గ్రహములకాంతిజ్వాల లెంతదేదీప్యమానములుగ నున్నవో చూడుము. కాంతిజ్వాల లట్లు గ్రక్కుచున్నను గ్రహములుతఱుఁగుటలేదు. వాని గమనవేగము క్రమము దప్పుటలేదు. ఒకదానిత్రోవ కింకొకటి యడ్డు వచ్చుటలేదు.

భూమినిజూడుము. దానిలోనుండి పుట్టువస్తువులఁజూడుము, మఱియు

నాభూగర్భమును జూడుము. సర్వజ్ఞుడును సర్వశక్తుఁడును గాక వాని నెల్ల నట్లు వర్తిల్లఁజేయఁజాలువాఁ డింకెవ్వఁడు కాఁగల్గును?

పచ్చికను మొలపించువాఁడు, ఆయాకాలములందు దాని నభివృద్ధి పఱచువాఁడు, గోవులు గుఱ్ఱములు గొఱ్ఱెలు బఱ్ఱెలు మొదలగుజంతువులు దానిని మేయునట్లు చేయువాఁడు, భగవంతుఁడే కదా!

నీవు సల్లుధాన్యమును మొలపించి చక్కఁగాఁ బెంపొందించి విత్తిన దానికి వేయిరెట్లెక్కువగాఁబండించి నిన్ను భాగ్యవంతునిఁగాఁ జేయువాఁ డాభగవంతుఁడే కదా:

కార్యకారణసంబంధమును నీవు గనుఁగొనఁజాలకున్నను మామిఁడి మొదలగు వృక్షములను, ద్రాక్ష మొదలగులతలను ఫలభరితములనుగాఁ జేయువాఁ డాభగవంతుఁడే కదా!

అధమాధమములయినవి చీమలు, దోమలు తమ్ముఁదాము సృష్టించుకొనఁగలవా? దైవముకంటెఁ గొంత దక్కువయిన నీవయినను వానిని సృష్టింపఁగలవా?

జంతువులు దాము జీవించుచున్నట్లు తెలిసికొనఁగల్గునే కాని తమ జీవితమును గూర్చి యచ్చెరువు చెందఁగలవా? జీవించియున్నప్పుడు క్షేమ మందునేకాని, జీవితాంతము కల్గునని యవి భావింపలేవుగదా!

ప్రపంచపుభాగములనే కాక సమష్టి ప్రపంచమును గూడ జూడఁగల్గి సంతోష వైచిత్ర్యముల నందఁగల్గిన నీకు ప్రపంచప్రవర్తకుఁడయిన

యా భగవంతుని ప్రాభవమును దెలిసికొనఁ బ్రయత్నించుటకంటె మేలయినకాలక్షేపమేమి యుండును? నీమనసును భగవద్విలాసములను బరిశీలించుటలోఁ గాక యిఁకే యితరకార్యములలోఁ బ్రవేశపెట్టఁ దగును?

జంతువులసృష్టియందు భగవంతునిశక్తియుఁ గరుణయు వ్యక్తమగుచున్నది. వానియాహారపదార్థ నిర్ణయమందు న్యాయ మున్నది, దానికి దానికేర్పఱుపఁబడినజీవిక చొప్పున నదియది సుఖముగా జీవించుచున్నది. ఒకదానిఁ జూచి మఱియొకటి యీర్ష్య చెందదు.

ఇట్లు చూడఁగాఁ బుస్తకపఠనమువలనఁ బొందఁదగిన జ్ఞానమేపాటిది? జ్ఞాన మెల్లఁ బ్రకృతిని జదువుటలో నున్నది గాని పుస్తకములను జదువుటలో లేదు.

జగన్నిర్మాణమునుగూర్చి సంతోషించినపిదప దానియుపయోగమును గూడ గుర్తింపుము. భూమిపైఁ బుట్టుచున్న ప్రతివస్తువును, నీమేలు కొఱకే నెగడుచున్నదిసుమా! అన్నవస్త్రములు, ఔషధములు, మొదలగున వన్నియు నందునుండి పుట్టుచున్నవే కదా!

దీనిని గనుఁగొన్నవాఁడే జ్ఞానవంతుఁడు. దీనినిగూర్చి పర్యాలోచించువాఁడే వివేకి.

లోకోపకారకమై గర్వమును గలిగింపని శాస్త్రజ్ఞానము నలవఱుచుకొనుము.

జీవించుట, మృతినెందుట, అధికారముచేయుట, విధేయతసూపుట, సౌఖ్యమందుట, బాధపడుట, ఇత్యాదు లన్నియు నీవనుభవింపవలసిన విషయములు. ఆయనుభవింపవలసినవాని నన్నింటిని జీవితక్రమము నీకుఁ బ్రత్యక్షపఱుచును.

అవినీహృదయమున మెదలుచున్నవి; చూడుము. అవసరములం దవి నీకు జ్ఞప్తికి రావలెను. సులువుగా వానిని నీవు గుర్తింపఁగలవు. శ్రద్ధ గలిగి యుండుము. సరిగా వానిని నిలుపుకొనఁగల్గుదువు.

ఇతర శాస్త్రము లన్నియు వ్యర్థములు. ఇతల జ్ఞాన మంతయు గర్వ పూరితము. మానవజీవితమున కవి యావశ్యకములు గావు. లాభకర ములును గావు. అవి మనుష్యునెక్కువ మంచివానినిగాఁ గాని ధన్యా త్మునిఁగాఁ గాని చేయఁజాలవు.

భగవంతునియందు భక్తియుఁ, బ్రాణికోట్లయెడ దయయు, నీ కెక్కు వగా ధన్యతను జేకూర్పఁగలవి. భగవంతుని కార్యములఁ బరిశీలించి తెలిసికొనుట నీ కాభక్తిని గల్గించును. నీకంటెఁ దక్కువయిన ప్రాణుల స్థితిగతులను గూర్చి విచారించుట నీకు దయను దయి వార్చును.

